1971లో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందిన
ఉత్తమ కవితా సంకలనం

# అమృతం కురిసిన రాత్రి

◆ మూడవ కూర్పు ◆

దేవరకొండ బాలగంగాధర తిలక్




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

AMRUTHAM KURISINA RAATHRI
*by Devarakonda Balagangadhara Tilak*


ప్రచురణ నెం. : 2350/2148 R

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : జూలై, 1968

ఎనిమిదవ ముద్రణ : జూలై, 1994

తొమ్మిదవ ముద్రణ : జనవరి, 1996

పదవ ముద్రణ : మే, 1999

పదకొండవ ముద్రణ : మార్చి, 2004





ముఖచిత్రం : చంద్ర

**వెల: రూ.70-00**

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
**విశాలాంధ్ర బుక్ హౌస్,**
(అబిడ్స్, సుల్తాన్‌బజార్), హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.





ISBN : 81-7098-047-X

ముద్రణ: **శ్రీకళాంజలి గ్రాఫిక్స్**, హిమాయత్‌నగర్, హైదరాబాదు.

# ఈ కూర్పు గురించి...

బాలగంగాధర తిలక్ కవితా సంపుటి మొదటి కూర్పుని రసజ్ఞలోకం ఆదరించి మూడు ముద్రణలయ్యేలా ప్రోత్సహించింది. మొదటి కూర్పులోని తిలక్ గేయాలతో పాటు అముద్రిత గేయాలను కూడా సేకరించి ఈ సంపుటిలో వేస్తే బాగుంటుందని సాహితీ మిత్రులు అనేక మంది సూచించారు.

సాచివెయ్యకుండా సకాలంలో సహకరించడం, చెయ్యడం కాస్త కష్టమే అయినా నిష్ఠూరం లేకుండా కష్టాన్ని ఆహ్వానించిన మిత్రులు అత్తలూరి నరసింహారావు, మిరియాల రామకృష్ణ, ఇంద్రగంటి శ్రీకాంతశర్మ గార్లకి కృతజ్ఞులం.

మొదటి కూర్పుని సమీక్షిస్తూ వస్తుదృష్టితోనో, కాలక్రమంలోనో గేయాల అమరిక మారిస్తే బాగుంటుందని సమీక్షకులు కొందరు అభిప్రాయపడ్డారు. ఈ కూర్పుని కాలక్రమంలో అమర్చి యిచ్చిన శ్రీ సోమసుందర్‌కి కృతజ్ఞులం.

కొత్తగా చేర్చిన వాటిలో కొన్ని తిలక్ మరణానంతరం మిరియాల రామకృష్ణ, సోమసుందర్‌గారలు పరిష్కరించి కళాకేళిలో ప్రచురించినవి.

కొన్ని అముద్రిత అసంపూర్ణ రచనల్ని అనుబంధంగా చేర్చాం. భావానుగుణంగా వాటికి శీర్షిక లుంచాం.

ఈ ముద్రణలో శ్రీ అబ్బూరి వరదరాజేశ్వరరావు గారిచ్చిన "భరతవాక్యం", "శవం" కవితలను, శ్రీ తంగిరాల వెంకట సుబ్బారావు గారిచ్చిన "త్రిశూలం", "కవి వాక్కు" (పూర్తి పాఠం), "త్రిమూర్తులు" (పాఠాంతరం) కవితలనూ చేర్చాము. వారిద్దరికీ మా కృతజ్ఞతలు.

ఈ ముద్రణలో శ్రీపాద కృష్ణమూర్తి (శ్యామాకృష్ణ) గారు పంపిన "ప్రాణంలేని నీడలు", "మళ్లీ ఒక దీపావళి", "వర్షహేళ", "నిరీక్షణ" కవితలనూ చేర్చాము. వారికి మా కృతజ్ఞతలు.

ఈ కూర్పును కూడా రసజ్ఞలోకం మరింత ఆదరణతో స్వీకరిస్తుందని ఆశిస్తూ –

**- ప్రకాశకులు**

# కవితా కదన క్షాత్రుడు

అది కాదు,
నాకు తెలియకడుగుతున్నాను
ఏమిటీ ఘోరం?
అబద్ధాలు ప్రకటించడానికి
అలవాటుపడిపోయిన - కాదు
అంకితం అయిపోయిన
ఓ దుర్వార్తా పత్రికలారా! చెప్పండి
ఈ వార్త నిజమేనా?
(బహుశా నిజమే అనుకోవాలి.
అప్పుడప్పుడో భయంకర సత్యం
ప్రకటిస్తారు! అప్పుడే మీ
అబద్ధాలకు విలువ.)

సిమెంటనే మారు పేరు ధరించిన
ఇసుకతో నిర్మించబడిన
వంతెనలాంటి ప్రభుత్వమా
ఏమిటీ ఘోరం?
అని నిన్నడిగి ఏం లాభం?
నిద్రపో హాయిగా
వృక్షమా! ఋక్షమా! ద్విపక్షమా!
బదులు చెప్పండర్రా! మీరైనా
జవాబులేదు.

గాలి మూగదయిపోయింది
పాట బూడిదయిపోయింది
వయస్సు సగం తీరకముందే
అంతరించిన ప్రజాకవి
నభస్సు సగం చేరకముందే
అస్తమించిన ప్రభారవి
మరి కనిపించడా?

కోకిలవలె కూజించే కలధ్వని
కేసరివలె గర్జించే రణధ్వని
ఇక వినిపించదా

భావి దూర తీరాలకు
చేరువుగా విహరిస్తూ
జీవనాడి స్పందించే
రుధిర మధువు లందించే
యువకవి లోక ప్రతినిధి
నవభావామృత రసధుని
కవితా సతి నొసట నిత్య
రస గంగాధర తిలకం
సమకాలిక సమస్యలకు
స్వచ్ఛస్ఫాటిక ఫలకం
నడినింగిని మాయమయాడా
మన మిత్రుడు
కవితా పుత్రుడు
కదన క్షాత్రుడు
సకల జగన్మిత్రుడు!

- శ్రీ శ్రీ

# "మావాడు-మహా గట్టివాడు"

ఆధునిక కవితారంగంలో - అంటే శ్రీశ్రీ యుగంలో - తమ రచనలు గ్రంథ రూపంలో రాకపూర్వమే యావదాంధ్ర దేశంలో ఉత్తమ కవులుగా లబ్ధ ప్రతిష్ఠులైన వారు ముగ్గురున్నారు. వారిలో తిలక్ ఒకడు; మిగిలిన యిద్దరూ శ్రీశ్రీ, అజంతాలు. దీనికి కారణం, శ్రీశ్రీ లో నైతే, ఆయన గేయాలలో పెల్లుబికిన అపూర్వ భావ విప్లవం. ఆయన రాసిన ప్రతి గేయమూ ప్రతి తెలుగువాడి గుండెలో ప్రతి ధ్వనించింది. అభ్యుదయ కవితా యుగానికి ఆయనే ఆద్యుడని అంగీకరింపజేసింది. మిగిలిన యిద్దరిలో యీ ప్రతిష్ఠకు కారణం ప్రధానంగా వారు సాధించుకున్న శైలీ రమ్యత. అజంతా మొత్తంమీద పదో పన్నెండో గేయాలు మాత్రమే రాసి తనదైన ఒక సొంత శైలిని నిర్మించుకున్న ప్రతిభావంతుడు. తిలక్ అంతకంటే విస్తృతంగా, బహుముఖంగా రాసి తన శైలిని స్థాపించుకున్నాడు. కవిత్వం కొద్దిగా రాసినా, ఎక్కువగా రాసినా తన సొంతమని చెప్పుకోదగిన శైలిని స్థాపించుకోలేనివాడు సాహిత్య చరిత్రలో నిలదొక్కుకోలేడు. నన్నయ, తిక్కన, శ్రీనాథుడు, పోతన, పెద్దన-పేర్లు అన్నిటికీ యీ శైలి సంబంధం వుండనే వుంది. ప్రేమ కవుల్లో కృష్ణశాస్త్రిగారికి అగ్రతాంబూలం యివ్వడం కూడా యిందుకే. అభ్యుదయ కవితా యుగంలో వందలమంది కవులు ఒకే రకమైన భావాలను కవిత్వంలో ప్రకటించినప్పటికి వారిలో బహుస్వల్ప సంఖ్యాకులు మాత్రమే కవులుగా చెలామణి కావడానికి్కూడా యిదే కారణం. ఈ మాట చెప్పినందువల్ల ప్రతిపాదిత వస్తువుకంటే, తత్ప్రయోజనం కంటే శైలికి అధిక ప్రాధాన్యమిస్తున్నాననే అపోహ ఎవరూ పడనవసరంలేదు. కవిత్వంలో శైలికి గల ప్రాధాన్యాన్ని వివరించడం, తిలక్ సర్వపాఠకులకు ఆకర్షణీయమైన శైలీవిన్యాసం చేశాడని చెప్పడం మాత్రమే - దీని ఉద్దేశం.

వచన కవితా ప్రక్రియను పరిపుష్టం చేసిన కొద్దిమందిలో తిలక్‌కు ప్రత్యేక స్థానం వుంది. ఈనాడు చాలావరకు పరిపక్వమైన వచన గేయపు శైలికి అతను ఎంతో దోహదం చేశాడు. వచన గేయపు శైలిలో తిలక్ చూపిన ఒడుపులవల్ల ఆ ప్రక్రియ - సంప్రదాయ పద్య కవితాభిమానులను కూడా చాలావరకు వశపరచుకుంది. సంప్రదాయవాదుల మెప్పు మన కెందుకని వాదించే తీవ్రవాదులు వుంటారని కూడా నాకు తెలుసు. కాని ఒక కొత్త ప్రక్రియ సాహిత్యంలో స్థిరపడటానికి చేసే ప్రయత్నంలో సంప్రదాయవాదుల ఆమోదం కూడా ఒక ముఖ్యమైన ఘట్టమని నేననుకుంటాను. తమ ప్రతిభా సంపన్నతచేత వచన కవితా ప్రక్రియను యీ మజిలీకి చేర్చిన కొత్తతరం కవుల్లో తిలక్ పేర్కొనదగినవాడు.

వచన కవిత నేడు ప్రధానంగా రెండు రకాలైన శైలులను ఆశ్రయించుకొని ప్రయాణం చేస్తూ వున్నది. ఒకటి సమాస బాహుళ్యమూ, సంస్కృత లేక ఆంగ్ల భాషా శబ్ద ప్రదర్శనమూ, ఉక్తిలో గ్రాంధికచ్ఛాయలూ కలిగి పద్యమూ వచన గేయమూ అనే భేదం మాత్రమే మిగుల్చుకుని పూర్వ కావ్య భాషా సంప్రదాయానికి చేరువుగా నడుస్తున్న శైలి. రెండవది, వ్యావహారిక భాషావాదాన్ని జీర్ణించుకుని ప్రజల పలుకుబడిలోని మెళకువలను సంగ్రహించుకొని, తెనుగు నుడికారములోని సొగసులను ఆవిష్కరించుకుంటూ, వర్తమాన కాలపరిస్థితులకూ, సమకాలీన ప్రజల హృదయాలకూ దగ్గిరగా నడుస్తున్న శైలి. తెనుగుభాషా, భావ వికాసోద్యమాలకు ఆద్యులైన గిడుగు, గురజాడల ఆశయాలకు యీ రెండవ శైలి నిజమైన వారసురాలు; మొదటిది నన్నయాదుల నుండి వస్తున్న కావ్య భాషా సంప్రదాయానికి దగ్గిరచుట్టము. ప్రజల భాషలో నుండి సహజముగా వచ్చిన శబ్దాలుగాని, పదబంధాలుగాని, అలంకారాలుగాని, నుడికారపు సొగసులుగాని ప్రకటించగలిగినంత శక్తివంతంగా; భావాన్ని–కావ్య భాషా సంబంధంగల కవితా సామగ్రి ప్రకటించలేదనేది అనుభవంలో ప్రతివారికీ, ప్రతి కవికి తెలిసిన విషయమే. కాని కావ్యం రాయడం మొదలుపెట్టగానే తాను ఏదో ఒక పై అంతస్తులో వున్నాననే భ్రాంతిని పొందడం వల్ల ఆ అంతస్తుకు తగిన భాష కావ్యభాషే అనే మూఢ విశ్వాసం వల్ల కవులు కృత్రిమత్వమనే రొంపిలో దిగబడిపోవడం జరుగుతున్నది. కవిత్వం ప్రజలకు దూరం కావటానికి యిదే మొదటి కారణం. ఈ కావ్యభాష అనే సంకెలను తెంచుకోలేక పోవడం, గ్రాంధిక పలుకుబడిని తప్పనిసరిగా ఆదరించవలసిరావడం, సంప్రదాయ ఛందస్సులనూ కొంతవరకు మాత్రాఛందస్సులనూ వాడే సందర్భాలలో తప్ప–వచన కవితా ప్రక్రియా రంగంలో అడుగుపెట్టిన వారికి ఏమాత్రం అవసరం వుండదు. అయితే పూర్వ వాసనలను పూర్తిగా వదిలించుకోలేకపోవడం వల్లనూ, గట్టి సమాసాలలో గొట్టు సంస్కృత పదాల్లో లేనిదే కావ్యరూపం సిద్ధించదేమోననే సందేహంవల్లనూ, ఆధునికులైన కవుల్లో చాలామంది, యీ దృష్ట్యా చూసినప్పుడు తప్పటడుగు వేస్తూ వున్నారనే చెప్పవలసి వస్తుంది. తిలక్ కూడా యీ పరిస్థితి తప్పించుకోలేక పోయిన సందర్భాలు చాలాచోట్ల కనిపిస్తాయి.

శైలిలోనూ, ఉక్తి విధానంలోనూ, కొన్ని చోట్ల కావ్య వస్తువులోనూ కూడా భావకవితాచ్ఛాయల బంధంనుండి బయటపడలేనిస్థితి తిలక్‌లో స్పష్టంగా కనిపిస్తుంది. "ఆర్తగీతం"లో "నేను చూశాను నిజంగా ఆకలితో అల్లాడి మర్రిచెట్టు కింద మరణించిన ముసలివాణ్ణి" అనే పంక్తితో ప్రారంభమై, కవి తన హృదయాన్ని ముక్కలుగా కోసి బైటికి విసిరివేస్తున్నట్టు శరపరంపరగా దూసుకు వచ్చిన కరుణామయ దృశ్యాలను వర్ణించిన తీరుకూ, అదే గీతంలో "కొత్త సింగారమ్ము వలదు, ఉదాత్త సురభిళాత్తశయ్యా సజ్జితము వలదు రసప్లావితం వలదు" వంటి పంక్తులలోని గ్రాంధిక వాసనకూ వున్న తేడాను గమనిస్తే నేను చెప్పదలచిన భావం స్పష్టమవుతుంది. ఈ

లోపం ఒక్క తిలక్‌లోనేకాదు; వ్యావహారిక భాషకూ, వచన కవితా ప్రక్రియకూ గల చారిత్రక పరిణామ సంబంధం సరిగా అంతుపట్టని అనేకమంది ఆధునిక కవుల్లో కూడా కనిపిస్తుంది."నీవు" అనే ఖండికలో వాడిన శైలి ఏ సరళమైన గీతపద్యమో రాసేటప్పుడు రాయవలసింది. సుమారుగా వెంకట పార్వతీశ్వర కవులనాటి సరళ వచనాల శైలి. సగం గ్రాంథికం, సగం వ్యావహారికం గల యీ శైలి సాంకర్యదశ వచనా కవితా రంగంనుండి తప్పుకోడానికి మరికొంత కాలం పడుతుంది. తిలక్ ఒక రమణీయమైన శైలిని సమకూర్చుకున్నవాడు కనుక అతని శైలి గురించి, దాని బాగోగులను గురించి యింతగా రాయవలసి వచ్చింది.

తిలక్ తాను ప్రధానంగా అనుభూతివాదినని బల్ల గుద్ది చెప్పుకున్నాడు. ఈ అనుభూతి వాదము యిటీవలి కాలంలో భావకవితాయుగ సంబంధి. ఇది వ్యక్తివాదానికి మరొక పేరు. "నా అనుభూతి నాది; దానిని నేను ఆవిష్కరిస్తాను" అనే తత్వం కవి పొందిన ప్రధాన అనుభూతుల ఆకృతిలో కవిత్వం దర్శనమిచ్చే ఏర్పాటు. ఇంతవరకైతే ఎవ్వరికీ ప్రమాదం ఉండదు. ఎందుకంటే వస్త్వాభావి దూర తీరాలకు శ్రయ కవితలో కూడా పాత్రల స్వభావ, స్వరూప చిత్రణ, వివిధ రసముల నిర్వహణ మొదలగువాటిలో కవియొక్క అనుభూతి ప్రధానపాత్ర వహిస్తూనే వుంటుంది. కాని ఈ అనుభూతి వాదం యీ వ్యక్తివాద ప్రాబల్యం సమాజాన్ని మింగేదిగా ఉన్నప్పుడే చిక్కు వస్తుంది. కవి భావనలో సామాజిక ప్రయోజన చైతన్యం మృగ్యమయ్యేటంత వరకు వ్యక్తిత్వం విస్తృతమైతే ఆ కవి ప్రజలకు పూర్తిగా దూరమైపోక తప్పదు. దీనిని తిలక్‌కు అన్వయించి చూసినప్పుడు తిలక్ తన కవితను గురించి తానేవిధంగా నిర్వచించుకొన్నప్పటికీ అతని ఊహలో అడుగడుగునా అభ్యుదయ భావావేశం తొంగిచూస్తూనే ఉంటుంది. "ప్రార్థన", "ఆర్తగీతం" వంటి మహోత్తమ గేయ కావ్యాలను తిలక్ మాత్రమే రాయగలడు. అభ్యుదయ కవితాయుగం బాగా ప్రవర్తిల్లిన రోజుల్లో అనేకమంది కవులు శైలికి, అక్షర రమ్యతకూ ప్రాధాన్యం యివ్వనందువల్ల అదొక లోపంగా పరిణమించింది. ఈ దోషాన్ని పరిహరించి తిలక్ అభ్యుదయ భావాలకు రమ్యమైన శైలిని సమకూర్చడంలో కృతకృత్యుడయ్యాడు. మొత్తంమీద చూస్తే అభ్యుదయ భావనా, కాల్పనికోద్యమకాలం నాటి శబ్ద సౌందర్యమూ - యీ రెంటి మేళవింపు తిలక్ కవిత్వమని చెప్పవచ్చు.

అభ్యుదయ కవితాయుగంలో కావ్యవస్తువు కొన్ని పరిధులకు లోబడి, కొన్ని నిర్దిష్టాంశాలకు మాత్రమే పరిమితమైపోయినట్లు కనిపించింది. ఆరంభ దశల్లోని ఆవేశం అలాగే ఉంటుంది. దాని పరిధిని విస్తృతపరచి దానిని జీవితంలో సర్వరంగాలకూ వ్యాపింపజేయాలనే ప్రయత్నం వచన కవితాయుగంలో వచ్చిన కొత్త మార్పు. అన్ని రసాలను వచన కవిత్వంలో నిర్వహించి ఒప్పించాలనే అస్మదాదుల ఆకాంక్షను ఉదాహరణప్రాయమైన కవిత్వం తిలక్ రాసి చూపించాడు. "నువ్వులేని

నీ పాట ఉంది" వంటి గేయాలు వచన కవితా ప్రక్రియలో ప్రేమ భావనలు కూడా ఎంత సుందరంగా చెప్పడానికి వీలుందో నిరూపిస్తాయి. "వాన కురిసిన రాత్రి"లో చెప్పినట్లు నిజంగా మనందరం చూడని సమయంలో ఒంటరిగా వెళ్ళి వెన్నెల మైదానంలో కురిసిన అమృతపు వానలో తడిసి దోసిళ్ళతో తాగి తిరిగి వచ్చిన వాడివలె మధురాతి మధురంగా కవిత్వం చెప్పాడు తిలక్. శృంగారాది యితర రసాలకు కూడా వర్తించగల విధంగా వచన కవితా ప్రక్రియ యిప్పుడు వచ్చిన ఈ మార్పును మొత్తం మీద కవిత్వంలో సామాజిక ప్రయోజన చైతన్యమనే పరమ లక్ష్యానికి భంగం లేనంతవరకు నేను - హృదయపూర్వకంగా ఆహ్వానిస్తాను.

తిలక్ ఖచ్చితమైన మానవతావాది. కేవలం వ్యక్తిగతమైన అనుభూతికి సంబంధించిన మానవతా భావనకు, సమాజపరమైన మానవ కారుణ్య భావనకు చాల తేడా ఉంటుంది. తిలక్ నిశ్చయంగా యీ రెండవ పద్ధతికి చెందినవాడే. అభ్యుదయ కవితా యుగపు ప్రధాన లక్షణమైన అంతర్జాతీయ భావనా, "సంకుచితమైన జాతిమతాల సరిహద్దుల్ని చెరిపివేసి" "అకుంఠిత మానవీయ పతాకను ఎగురవేసే" తత్త్వమూగల అభ్యుదయ కవికంఠమతనిది.

తిలక్ కవిత అభ్యుదయ కవిత్వం కొన్ని పాళ్ళు, భావకవిత్వం కొన్ని పాళ్ళు కలసిన మిశ్రమరూపం. "నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే విజయ ఐరావతాలు; నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు" అని తిలక్ చెప్పుకున్నాడు. ఇందులో అతని భావమేదైనా, మొదటిది తన వస్తువును గురించీ, రెండవది తన శైలిని గురించీ చెప్పుకున్నట్లు నేనర్థం చేసుకున్నాను. తిలక్ అభ్యుదయ భావనకు అందమైన శైలిని సమకూర్చి; అభ్యుదయ కవితా కాలంలో ఉన్న దోషాన్ని తొలగించడానికి ప్రయత్నించాడని చెప్పుకోవచ్చు. భావకవులు శబ్ద సౌందర్యానికి, శైలీ రమ్యతకూ ప్రాధాన్యం యిచ్చారు. అభ్యుదయ కవులు ప్రగతి కారకమయిన వస్తువుకు. ఈ రెంటిలోని మంచిని ఒకచోట చేర్చుకునే ప్రయత్నంలో తప్పేమీలేదు. భావన ఎంత అభ్యుదయకరమయినదైనా సుందరంగా వ్యంగ్య విలసితంగా చెప్పలేకపోతే రాణించదు. అభ్యుదయ కవిత్వాన్ని కూడా పేలవంగా కాకుండా అందంగా చెప్పాదాం అన్నదే - తిలక్, ఆచరణ ద్వారా చేసిన సూచన.

తిలక్ మంచి కవి కాబట్టే అతని భావాల ప్రభావం యువతరం మీద తప్పకుండా వుంటుంది. అధివాస్తవికవాదమని చెప్పుకోదగిన అతని అనుభూతి వాదము కవితకు తుది తీర్పు కాజాలదు. తిలక్ భావకవితా మార్గం నుండి వచ్చిన వాడు కావడంచేత దానిలోని మంచితోపాటు దానిలోని దోషాలు కూడా అతనిలో వుంటాయి. వాటిని పరిహరించుకోవాలి. ఇటీవల యువతరం కవుల్లో వ్యక్తివాదమూ తత్ఫలితమైన అరాచకవాద తీవ్రవాద ధోరణులూ పొడచూపుతున్న సూచనలు కనిపిస్తున్నాయి. కవితలో సామాజిక ప్రయోజన లక్ష్యం కొరవడుతున్నదేమోనని

అనిపిస్తోంది. ఇందువల్ల కవిత్వం ప్రజలకు మరింత దూరమయ్యే ప్రమాదం ఏర్పడుతుంది. యువతరం కవులు దీనిని గురించి చక్కగా ఆలోచించుకోవాలనీ, సరియైన మార్గాన్ని అనుసరించాలనీ నా ఆకాంక్ష.

తిలక్ నాకు చిరకాల మిత్రుడు. మా పరిచయం దాదాపు పాతికేండ్ల నాటిది. ఆ రోజుల్లో మేము నర్సారావుపేటలో స్థాపించిన "నవ్యకళా పరిషత్"లో అతను ప్రముఖ సభ్యుడు. అతని అనారోగ్యంవల్ల మధ్యలో చాలా కాలం మా పరిచయబంధం దాదాపు తెగిపోయినంత పని అయింది. చివరి దశలో మళ్ళీ కలిశాం. అతనికి ఆ అనారోగ్యం లేకపోతే యింకా ఎంతగా రాసేవాడో అనేది, కేవలం ఊహాకు మాత్రమే మిగిలింది. మరి అకాల మరణానికి గురికాకుండా వుంటేనో? అదీ అంతే...ఇంతకూ అతను మనకు మిగిల్చి వెళ్ళిన ఆస్తి యీ కావ్యం. అమూల్యమైన యీ నిధికి విలువ కట్టే బాధ్యత విశాలాంధ్రవారు నామీద పెట్టారు. ఇది నిజంగా నా అదృష్టమనుకుంటాను.

తిలక్ శారీరకంగా మంచి రూపసి. అలాగే మానసికంగా కూడా మంచివాడు. మెత్తనివాడు, స్నేహశీలి, కవి, రసజ్ఞుడు...ఇన్ని మాటలెందుకు, అతనే ఒకచోట అన్నట్లు "మావాడే – మహా గట్టివాడు."

ఫ్రీవర్స్ ఫ్రంట్
హైదరాబాదు
3, జూన్ 68.

కుందుర్తి

# ఇదీ వరస...

**కొన్ని అసంపూర్తి, అముద్రిత రచనలు**

# నా కవిత్వం

నా కవిత్వం కాదొక తత్వం
మరికాదు మీరనే మనస్తత్వం
కాదు ధనికవాదం, సామ్యవాదం
కాదయ్యా అయోమయం, జరామయం.

గాజు కెరటాల వెన్నెల సముద్రాలూ
జాజిపువ్వుల అత్తరు దీపాలూ
మంత్ర లోకపు మణి స్తంభాలూ
నా కవితా చందనశాలా సుందర చిత్ర విచిత్రాలు.

అగాధ బాధా పాథః పతంగాలూ
ధర్మవీరుల కృత రక్తనాళాలూ
త్యాగశక్తి ప్రేమరక్తి శాంతిసూక్తి
నా కళా కరవాల ధగద్ధగ రవాలు

నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసే దయాపారావతాలు
నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే విజయఐరావతాలు
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు.

*–1941*

★ ★ ★

# దృశ్య భావాలు

ఘోష
హేష
మురళి
రవళి
కదలి కదలి
ఘణం ఘణల నిక్వణ క్వణల ఝణం ఝణల
బండిమువ్వ
కాలిగజ్జె
కలసిపోయి
పక్షిరెక్క
పొన్నమొక్క
జొన్నకంకె
తగిలి పగిలి
వానచినుకు చిటపటలో కలసి
కొబ్బరిమొవ్వ పిచ్చుక గొంతులో మెరసి
మూలుగు యీలుగు కేక
చప్పటులు చకచకలు నవ్వు
పొదివికొనీ అదిమికొనీ
కదలి కదలి
ఘోష
హేష
మురళి
రవళి
నా మనస్సులో నిశ్శబ్దపు స్తంభంలా
నిలుచున్నవి
చదల చుక్క
నెమలి రెక్క

అరటి మొక్క
ఆమె నొసటి కస్తురి చుక్క
కడలి వచ్చి ప్రిదిలినవ్వి
నవ్వి నవ్వి నీరెండల పరుగులెత్తి
మావి తోపు నీడనాడి
కుంద జాజి సేవంతుల ల
వంగ మల్లీ మందారాలు బంతులాడి
కొలనిగట్లు పడుచుపిల్ల
కుచ్చెళ్ళతో పంతమాడి
కలలమెట్లు వంగినడచి
అలల కడలి అంచు లొరసి
నా తలపుల్లో కలసిపోయి
నా పలుకులలో పరిమళించు
చదలచుక్క
నెమలిరెక్క
అరటిమొక్క
ఆమెనొసటి కస్తురి చుక్క

*–1941*

★ ★ ★

# ప్రాతఃకాలం

చీకటి నవ్విన
చిన్ని వెలుతురా!
వాకిట వెలసిన
వేకువ తులసివా!

ఆ శాకుంతల ధ్వాంతములో
నవసి యిలపై వ్రాలిన
అలరువా! – అప్స
రాంగనా సఖీ చిరవిరహ
నిద్రా పరిష్వంగము విడ
ఉడు పథమున జారిన
మంచు కలవా!

ఆకలి మూడుచు
వాకిట వాకిట
దిరిగే పేదల
సురిగే దీనుల
సుఖ సుప్తిని చెరచే
సుందర రాక్షసివా!

యుద్ధాగ్ని పొగవో – వి
రుద్ధ జీవుల రుద్ధ కంఠాల
రొదలో కదిలెడి యెదవో!
అబద్ధపు బ్రతుకుల వ్యవ
హారాల కికక మొదలో?

కవికుమారుని శుంభ
త్కరుణా గీతమువా!

శ్రీ శాంభవి కూర్చిన
శివఫాల విలసితమౌ
వెలుగుల విబూదివా!

దేశభక్తులూ, ధర్మపురుషులూ
చిట్టితల్లులూ, సీమంతినులూ
ముద్దుబాలురూ, ముత్తైదువలూ,
కూడియాడుచు కోకిల గళముల
పాడిన శుభాభినవ ప్రభాత
గీత ధవళిమవా!

★ ★ ★

# సంధ్య

గగనమొక రేకు
కన్నుగవ సోకు
ఎరుపెరుపు చెక్కిళ్ళ విరిసినది చెంగల్వ
సంజె వన్నెల బాల రంగు పరికిణీ చెంగు
చీకటిని తాకినది అంచుగా
చిరుచుక్క ప్రాకినది

వాలు నీడల దారి నీలి జండాలెత్తి
చుక్క దీపప్రువత్తి సాగయు బాటలనల్ల
నిదుర తూలెడి నడక గదుము మైకపు కోర్కె
వచ్చు నిశిలో కరగి నవ్వు శశిలో కలసి
సంజ వన్నెల బాల రంగు రంగు రుమాల
విసిరింది కలలల్లు
వెండితోటల మధ్య
వ్రాలినది వ్రాలినది తావిగా
సోకినది సోకినది

సంజె పెదవుల ఎరుపు కడలి అంచుల విరిగి
సంజె పరికిణీ చెరగు ఎడద లోతుల మెరసి
ఏటి కొంగల నిదుర ఎర్రగా ప్రాకింది
బాతు రెక్కలనీడ బరువుగా సోలింది
సంజ వన్నెలచాలు స్వర్ణ స్వర్ణది ధార
వయసు మైకపు జీర కరగు మబ్బుల తేల
గగనమొక రేకు
కన్నుగవ సోకు

– *1941*

★ ★ ★

# ఈ రాత్రి

ఈ రాత్రి
బరువుగా బరువుగా
బ్రతుకు కీళ్ళ సంధులలోన
చీకటి కరేల్మని కదిలింది

ఈ రాత్రి
నిలువునా నిలువునా
పరచుకుని అవనిగుండె నెరదలలోని
వింత బాధల విప్పి చూపింది

ఈ రాత్రి
మూగతో సైగతో
మేలుకొన్న నిరాశతో మాటలాడాను

– *1941*

★ ★ ★

# పాడుపోయిన ఊరు

అది అంతా యిసుక
చరిత్రలో ఒక మసక
ఇది నశించిన ఒక గ్రామం
విశ్వసించే ఒక శ్మశానం
ప్రాణంగల పాడే వేణువు లీ యిసుక రేణువులు
ఈ భూమికింద మేడలు మిద్దెలు కదిలే విచిత్ర శబ్దం
ఈ గాలివాన పూర్వుల శరీరాల స్పర్శల శైత్యం
గతమంతా తోలుబొమ్మలాడిన ఒక తెర
వర్తమానం నీ కన్నుల గప్పిన ఒక పొర
కాలిపోయే యిల్లులా జీవితం ఒరుగుతుంది
ఒక వెగటు ఏదో నన్నావరించుకుంది
కాలం పాడునుయ్యిలా నా కన్నులకు కనబడింది.

*–1941*

★ ★ ★

# ప్రవాస లేఖ

స్వాగతం :

పగటికి చితి పేర్చిన సంధ్యాజ్వాలలు మాలలుగా
నీ మెడలో--

వెన్నెలను మథించి తీసిన కరాళ గరళం నీ యెదలో
—అబ్బ, ఎంతశక్తి సంపాదించావోయీ!

అనుకున్నాను అప్పుడే! జీవితపు చక్రాల సీల ఊడి
పోతే, బ్రతుకు బురదలోపడి దొర్లుతుందని
అప్పుడు శాశ్వతత్వం పరిహసిస్తుందని

ఆనందానికి మేర విషాదమని నలుదెసలూ కల్పిన
చోట వ్రాయబడి ఉందిటగా!

ఆమె చేతిని అతడు తన చేతిలో పెట్టుకున్నపుడు,
కాలు అంతా యిమిడి, అరటిచెట్టు మొవ్వులో
ఒదిగి, ఫక్కున నవ్విందిటగా!

దహన్! నీ గుండె ధ్వనిస్తుందా?

– 1941

★ ★ ★

# మేగ్న కార్టా

మేం మనుష్యులం
మేం మహస్సులం
గుండె లోపలి గుండె కదలించి
తీగ లోపలి తీగ సవరించి
పాట పాటకి లేచు కెరటంలాగ
మాట మాటకి మోగు కిన్నెరలాగ
మేం ఆడుతాం
మేం పాడుతాం

మేం ఉపాసకులం
మేం పిపాసువులం
భూమి అంచులకు వెలుగు తెరకట్టి
తారకల గతికొక్క శ్రుతివెట్టి
పాట పాటకి వెండిదారంలాగ
మాట మాటకి మందు దూరంలాగ
మేం సాగుతాం
మేం రేగుతాం

మేం నవీనులం
మేం భావుకులం
పాత లోకపు గుండెలో శతఘ్ని పగిలించి
భావి కాలపు చంద్రకాంత శిలల కరగించి
పాట పాటకి సోకు స్వర్గంలాగ
మాట మాటకి దూకు సింహంలాగ
మేం నిలుస్తాం
మేం పిలుస్తాం.

మేం మనుష్యులం
మేం మహాస్సులం
మాకు దాస్యంలేదు
మాకు శాస్త్రంలేదు
మాకు లోకం ఒక గీటురాయి
మాకు కరుణ చిగురు తురాయి
మేం పరపీడన సహించం
మేం దివ్యత్వం నటించం

గాలి గుర్రపు జూలు విదిలించి
పూలవర్షం భువిని కురిపించి
పాట పాటకు పొంగు మున్నీరులా
మాట మాటకి జారు కన్నీరులా
మేం ఆడుతాం
మేం పాడుతాం.

*–1942*

★ ★ ★

# ఖాళీ చేసిన...

పట్టణాలు వదలి
పాపాలను భద్రపరచి
బాంబులకి భయపడి
పరుగెత్తారు
మోయిలు మోయిలు పైన
మెరపుల్లా;
మెరపు కరచిన
ఉరుముల్లా అరుస్తూ!!

కాని బాటప్రక్క
కడుపులోన కనులు పెట్టి
సడలిపోయి వడలిపోయి
మండిపోయి మాడిపోయి
ఆకాశపు కప్పుక్రింద
అనంత విశ్వపు గదిలో
ఆకలితో ఆడుకుంటూ
ఆకలినే ఆరగిస్తూ
ఆకలినే ఆవరిస్తూ
నల్లని మట్టిదిబ్బలా
చెల్లని పెంటకుప్పలా
కూరుచున్న కబోదికి
పంగుకు, వికాలాంగుకు
నిస్సంగుకు, నీర్సాంగుకు
భయమే లేదా!
బాధయె లేదా!

ప్రభుత్వం వీరిని
పాటిస్తుందా! – చస్తే
పూడుస్తుందా!

ఒక బాంబు
ఉరిమి ఉరిమి
ఊడిపడెను.

'మాదాకవళం' అని
మహదానందంతో
దోసిలి పట్టెను
తల పగిలిందీ,
కల చెదిరిందీ

న్యూస్‌పేపర్లో
'No Casualities' అని వార్త!

*–1942*

★ ★ ★

# వేసవి

కాలం కదలదు, గుహలో పులి
పంజా విప్పదు, చేపకు
గాలం తగలదు.

చెట్లనీడ ఆవులు మోరలు
దింపవు, పిల్లిపిల్ల
బల్లిని చంపదు.

కొండమీద తారలు మాడెను
బండమీద కాకులు చచ్చెను.

కాలం కదలదు, గుహలో పులి
పంజా విప్పదు, చేపకు
గాలం తగలదు.

ఎండు టాకులు సుడిగాలికి తిరిగెను
గిర్రున, పడగొట్టిన బిక్షుకి అరచెను
వెర్రిగ.

పంకాకింద శ్రీమంతుడు ప్రాణం
విడచెను, గుండెకింద నెత్తురు
నడచెను.

ఆకాశం తెల్లని శ్మశానమై
చెదరెను, సూర్యుడి తలలో పెను
మంటలు కదలెను.

కాలం కదలదు, గుహలో పులి
పంజా విప్పదు, చేపకు
గాలం తగలదు.

నిశ్శబ్దం అంటుకుంది
మధ్యాహ్నం మంటల జుట్టుని విరబోసుకు,
నగ్నంగా రోడ్లమీద తిరగుతూంది,
పిచ్చిదాని వొంటిమీద నెత్తుర కల,
పిల్లవాడి సంధిలోన భూతం తల.

*–1943*

★ ★ ★

# శిక్షాపత్రం

ఒకనాడు
గల గలా ఫెళ ఫెళా
విరిగి పడుతుంది నీ రంగు గాజు పెంకుల మేడ!

ఒకనాడు
తెరచుకొని, పరచుకొని
పంజాను చరచుకొని
బోను విడివస్తుంది క్రౌర్యమనే పసుపు వన్నెల పెద్దపులి!

ఒకనాడు
వేదం శాస్త్రం విజ్ఞానం
పట్టణాలు, పల్లెటూళ్ళు
ప్రాక్పశ్చిమాల విషపు పరిధులు
తిరిగి తిరిగి గిర్రున తిరిగి తిరిగి
పిడికెడు బూడిదలో పేర్లు వ్రాసికొనును!

కాని, నీ
కనురెప్పల సందుల నుండీ
బ్రతుకు గోడ చీలికల నుండీ
వినవచ్చును ఒక కష్టజీవి మూలుగు
ఒక పేదవాని యీలుగు!

కనవచ్చును
నీ యుద్ధానికి స్వార్థానికి బలి యిచ్చిన
సైనికలోకపు సీసపు నాలుకలపై కసితో కత్తులు! కసికత్తులు

ఎప్పుడో, ఎప్పుడో
న్యాయం తన భయంకర ఛత్రం విప్పినప్పుడు
ధర్మం కత్తుల బావుటా ఎగురవైచినప్పుడు

గత చరిత్రలు నక్షత్రాలై కన్నీళ్ళు కార్చినపుడు
ఓ వర్తకుడా! ప్రభుత్వాధ్యక్షా
ఓ స్వార్థజీవీ!
మీరే జవాబుదారీ
మీకే శిక్ష వుంది
అదిగో అదిగో
భావి మైదానంలో మీ కోసం
విద్యుత్ రజ్జులతో ఉరి వుచ్చులు! ఉరి వుచ్చులు!
నవ్వే, అరచే చప్పట్లు చరచే చీకటి ఉరి ఉచ్చులు

*–1943*

★ ★ ★

# ముసలివాడు

కనుగూడులు నల్లనయి
పెనుమ్రోడులు చల్లనయి
కీలు కీలుగా బాధగా
నాడు నాడులు లాగగా
చలిగాలి చూరులో కసరినటు
చలిచీమ మట్టిలో దొలిచినటు
వచ్చినది మూగినది ముసిరినది
ముసలితనము

ముసలివాణ్ణి నాయనలారా
ముసలివాణ్ణి.

పై కప్పు వంగి పడు
పాడిల్లు వలె నిలిచి
వీధిపోయే వింత వింతల
చూసి రోసి
బ్రతుకొక్క ఆరినవత్తి కొడిలా తలచి మిథ్యలా కలచి
గతించిన జితించిన బ్రతుకులోకి
గులక రాళ్ళు గలగల మ్రోగే
గుల్ల బ్రతుకు లోనికి
కల్ల బ్రతుకు లోనికి
చూసి రోసి
బ్రతుకొక్క ఆరినవత్తి కొడిలా తలచి
మిథ్యలా కలచి

పెదవి సందుల వెగటు నవ్వును బిగబట్టి
కర్రనానుకు సాగిపోయే
ఎముకల గూడుని అరిగిపోయిన జోడుని
ముసలివాణ్ణి నాయనలారా
ముసలివాణ్ణి

ఒకనాడు నే ప్రొఫెసర్ని
సామ్యవాదిని
గ్రంథకర్తని

అప్పుడు భవిష్యత్తు రంగురంగుల వల
ఈనాడు గుండెలో మెదిలే పీడకల
నేడు కనుల సందుల నిరాశ
మసి మసిగ పాకిపోయే
కసికసిగ
ముసలివాణ్ణి నాయనలారా
ముసలివాణ్ణి

ఒకనాడు నే వలచి పెండ్లాడిన
ఒయ్యారపు నాభార్య అదిగో
విధి లిఖించిన వెర్రి చిత్రమువలె
ఎండిపోయిన ఏటిగట్టువలె
నడుమునొప్పి తనకు మిగిలినశక్తిగా
పక్షవాత భయం తన భవిష్య దాశగా
కదలలేక మెదలలేక
మెతుకులు కతకలేక చావును
వెతికికొనే
నా వయ్యారపు భార్య అదిగో

గదిమూలల సాలిగూడులు
గది గోడల గబ్బిలాలు
గదిలోపల పక్షవాతపు
కుక్కి మంచపు కౌగిలింతలో
చెదపట్టిన భాగవతం
బిలహరి రాగంలో చదివే
ముసలివాణ్ణి నాయనలారా
ముసలివాణ్ణి

నాకు కలలో కనిపించును
డాక్టరు స్టెతస్కోపు
విరిగిన బాతు మెడ

దున్నపోతులు
నా భార్యశవం
ముసలివాణ్ణో నాయనలారా
ముసలివాణ్ణో

చివరకు చివరకు అక్కడికే అక్కడికే
అది జీవిత పరమసత్యం
అది నాగరకత గమ్యస్థానం
అది చరిత్రల సారాంశం
అక్కడ చీకటి లోతెరుగని చీకటి
దట్టపు చీకటి
సుడి తిరిగే చీకటి
పాములు బుసకొట్టే చీకటి
తుది ఊపిరి మసలే
అక్కడికే అక్కడికే వెళ్ళబోయే
ముసలివాణ్ణో నాయనలారా
ముసలివాణ్ణో నాయనలారా
ముసలివాణ్ణో

–1943

★ ★ ★

# సైనికుడి ఉత్తరం

ఇక్కడ నేను క్షేమం - అక్కడ నువ్వు కూడా
ముసలి అమ్మా, పాత మంచంకోడూ
మన చిన్నబ్బాయి, చెరువులో కొంగా........

ఇపుడు రాత్రి, అర్ధరాత్రి
నాకేం తోచదు నాలో ఒక భయం
తెల్లని దళసరి మంచు రాత్రి చీకటికి అంచు
దూరంగా పక్క డేరాలో కార్పొరల్ బూట్స్ చప్పుడు
ఎవరో గడ్డిమేటి మీదనుంచి పడ్డట్టు-
నిశ్శబ్దంలో నిద్రించిన సైనికుల గురక
చచ్చిన జీవుల మొరలా వుంది.

అబ్బ చలి ! నెత్తురు చల్లబడే చలి !
పొడుగాటి చుట్టకాల్చినా
లిండెల్ (రూపాయి దాని పాపం ఖరీదు)
లిండెల్ గుండెల్ హత్తుకున్నా
దాని సారానోరు నీరుతాగినా ఈ చలిపోదు.

పోదు నాలో భయం మళ్ళీ రేపు ఉదయం
ఎడార్లూ నదులూ అరణ్యాలూ దాటాలి.
ట్రెంచెస్‌లో దాగాలి
పైన ఏరో ప్లేను, చేతిలో స్టెన్‌గన్
కీ యిస్తే తిరిగే అట్టముక్క సైనికులం
మార్చ్!
వన్ టూ త్రీ ఫూట్ డెడ్ ఎవడ్

నువ్వా నేనా
కేబుల్ గ్రాం యిప్పించండి కేరాఫ్ సో అండ్ సో
(మీ వాడు డెడ్.)

స్వప్రహతప్పిన ఎనేస్థిషియాతో
వెన్నెముక కర్రలా బిగిసింది.
యుద్ధం యుద్ధం
లిబియాలో బెర్లిన్‌లో స్టాలిన్‌గ్రాడ్‌లో
స్వార్థం పిచ్చికుక్కలా పరుగెత్తింది.

అబ్బ ! వణికించే చలి
అందరూ నిద్రపోతున్నారు
అందరూ చచ్చిపోతున్నారు
అర్ధరాత్రి దాటిందని మోగిన ఒంటిగంట
మంటలా మొహాన్ని కొట్టింది.

నే నిదివరకటి నేను కాను
నాకు విలువల్లేవు
నాకు అనుభూతుల్లేవు
చంపడం, చావడం
మీసం దువ్వటం లాంటి అలవాటయ్యింది.

కనిపించే ఈ యూనిఫారం క్రింద
ఒక పెద్ద నిరాశ, ఒక అనాగరికత
బ్రిడ్జీ కింద నదిలాగ రహస్యంగా వుంది
వదలలేని మోసపు ఊబిలాగ వుంది
నేనంటే నాకే అసహ్యం
అందుకే మరీ మరీ చంపుతాను, మరీ మరీ తాగుతాను
ఇంకేం చేసినా ఎవరూ ఒప్పుకోరు.

ఇంక తెల్లవారుతోంది
దూరంగా ఆల్ప్స్‌మీద మంచు దుఃఖంలా కరుగుతోంది
ప్రభాతం సముద్రం మీద వెండి నౌకలా ఊగుతోంది
తిరిగి ఎప్పుడు మన ఊరు వస్తానో!
నిన్ను చూస్తానో?

అందమైన తెల్లని నవ్వు నీ మెడలో
గొలుసు గొలుసులుగా కదిలినప్పుడు,
అదో విధమైన చెమ్మగిలిన చూపు
నెమలి రెక్కలా విప్పుకున్నప్పుడు

ఎన్నాళ్ళకి ! ఎన్నాళ్ళకి !
కొన్నివేల మైళ్ళ దూరం మనమధ్య
ఒక యుగంలా అడ్డుపడింది.
ఇంక సెలవ్ మైడియర్!
నిద్ర వస్తోంది మత్తుగ నల్లగా
అడుగో సెంట్రీ
డేరాముందు గోరీలా నిలబడ్డాడు

అదిగో యింకా
కార్పొరల్ బూట్స్ చప్పుడు
కడుపులో నీళ్ళు కదులుతూన్నట్లు
జాగ్రత్త సుమీ జాగ్రత్త
నువ్వూ, పిల్లలూ, బల్లులూ అందరూ.

మళ్ళీ జవాబు వ్రాయ్ సుమీ!
ఎన్నాళ్ళకో మరీ
సెలవ్! అబ్బా! చలి!
చలి గుండెల మీద కత్తిలా తెగింది.
నీ రూపం నా దేహానికి వెచ్చగా తగిలింది.

–*1943*

★ ★ ★

# టులాన్

నిశ్శబ్దపు మెత్తనిపరుపుల పైన
నిదురించినది పట్టణమంతా
కొండ చివర ఎర్రని నక్షత్రం
రాలిపడింది సముద్రపు నీలంలో

చీకటి కుంపటిలో అస్పష్ట భవిష్యత్తు
రాజుకుంటున్నది రవ్వలు రవ్వలై ముక్కలు ముక్కలై

"నాలుగు కొట్టింది చర్చిగంట
నిదురించే 'టులాన్' పట్టణపు గుండెలో
పగిలింది జర్మను శతఘ్ని...."

ఒక్కొక్కటి ఒక్కొక్కటి యుద్ధనౌకలు
ఒరిగి ఒరిగి సముద్ర నిర్నిద్ర జలతరంగ భుజంగ
పరీరంభమ్ములలో సురిగిపోయినవి.

బలి యిచ్చిన ప్రాణదీప్తి
జలధి గర్భాభరిత బడబాగ్నిలో కలిసి
శిఖలపఱచి, నాలికలు తెరచి, నాట్యమాడింది.

'టులాన్' భూమిమీద
ప్రజల వేడికన్నీళ్ళ వాన వాగులై పారింది
ఒహో టులాన్! ఒహో టులాన్!
మరపురాని స్మృతిపై ఒరిగిపొమ్ము
మా బ్రతుకులలో కారుచిచ్చు కలవై, అలవై.

★ ★ ★

## ౨ *

అది నవంబరు పంద్రెండవ తేదీ
దెబ్బతిన్న ఫ్రెంచి దేశం విప్పిచూపిన రక్తపు మరకల ఛాతీ
మండి మండి బాడబమై సాగిన రేగిన అవజ్ఞా జ్యోతీ

నిశ్శబ్దపు మెత్తని పరుపులపై
నిదురించెను పట్టణమంతా
కొండచివర ఎర్రని నక్షత్రం
రాలి పడింది సముద్రనీలంలో

చీకటి కుంపటిలో అస్పష్ట భవిష్యత్తు
రాజుకొంటున్నది రవ్వలు రవ్వలై చుక్కలు చుక్కలై

నాలుగు కొట్టింది చర్చి గంట
నిదురించే టులాన్ నగర హృదయంలో
పేలింది జర్మన్ శతఘ్ని

శత్రు యంత్ర లోహచక్ర పదఘట్టనలో
పిండీకృత ధరాతలం వేనవేలు
అవమానపు నెరదలలో ఆక్రోశించింది.

చలువరాల గోరీలలో
మాతృధాత్రి మట్టి పొరలలో
మణగిన మృతవీరుల గుండెలలో
ఆ సమయంలో
డార్లన్ పెటెయిన్ లావెల్ మొదలగు నాయకులందరూ
అధికారపు చీకటిలో గొంతు విరిగిన గుడ్లగూబలు
'నాజీ నాజీ నరహంతకు' లను కేకలు
సముద్రపు గుండెలలో తిమింగలములవలె తిరిగినవి
'జై ఫ్రాన్సు జై' అను ధ్వానమ్ములు దిక్కులలో మ్రోగినవి.

★ ★ ★

* టులాన్ గీతిక మరో రూపంలో

# గుండెకింద నవ్వు

చేతిలో కలం అలాగే నిలిచిపోయింది
చివరలేని ఆలోచన సాగిపోయింది
ఏదో రహస్యం నన్నావరించుకుంది
అపుడే నీ నవ్వు నా గుండె కింద వినబడింది.

పడుతూలేస్తూ పరుగులిడే మహాప్రజ
పిలుస్తూ బెదురుతూపోయే కన్ను గవ
కాలి సంకెలల ఘలంఘల వినబడే రొద
ఏమీ తోచక భయంతో కళ్ళు మూశాను
అప్పుడే నీ నవ్వు నా గుండె కింద వినబడింది.

ఆకు ఆకునీ రాల్చింది కడిమిచెట్టు
రేకు రేకునీ తొడిగింది మొగలు మొక్క
రెప్ప రెప్పనీ తడిపింది కన్నీటి చుక్క
యెందుకో యీ ప్రాణిప్రాణికీ విభేదం
ఎరగని నా మనస్సు నాలోనే చెదిరింది.
అపుడే నీ నవ్వు నా గుండె కింద వినబడింది.

వెళ్ళిపోయే చీకటిని వదలలేక వదిలే తార
వదలిపోయే జీవితాన్ని వీడలేక వీడిపోయే లోకం
కాలుజారి పడిన కాలపు పాదు నుయ్యిలో కనబడిన శూన్యం
కాలు కదిపిన చలువరాల సౌధంలో వినబడిన గానం
ఏమిటని ప్రశ్నిస్తే ఏమో అని పలికిన నిశ్శబ్దం
అపుడే నీ నవ్వు నా గుండె కింద వినబడింది.

ఆకాశపు వొంపులోన ఆర్ద్రం వెనుక నీ నవ్వు
పాతాళం లోతులలో ప్రతిధ్వనించి సాగింది
అంధకారపు సముద్రానికి అవతల వొడ్డున నీ రూపం
అందుకోలేని నా చూపుకి ఆశ ఆశగా సోకింది.

రా! ప్రశ్నించే నా మనస్సులో నీ చల్లని చేతితో నిమురుకో
రా! నా కనురెప్ప మాటుగా నీ మెరపు వీణ మెల్లగా మీటుకో
కమ్ముకుంది నాలో భయంతో కలసిన ధైర్యం
ప్రవహించింది నాలో తీరంలేని రజిత నదం
ఇపుడే ఇపుడే నీ నవ్వు నా గుండె కింద వినబడింది.

*–1944*

★ ★ ★

# ఈ రాత్రి

ఈ రాత్రి సామి దగ్ధమయింది
ఈ ధాత్రి నిస్తబ్ధమై వుంది
హేమగాత్రి నీ చరణ మంజీరం
నిస్వనింపదు

నా లోపల ఆశామందారం
కిసలయింపదు

గాలిలేని ప్రకృతి యోగిలాగ రోగిలాగ
మూల్గుతోంది

కాలు విరిగిన ముసలికుక్క దీనంగా
మొరుగుతోంది

తరతరాల నిస్పృహ నన్నావరించుకొంది
చరచరాలు తాకిన నీ మూర్తి ముడుచుకొంది

యుద్ధం మీద యుద్ధం వచ్చినా
మనిషి గుండె పగలలేదు

మనిషి మీద మనిషి చచ్చినా
కన్నుతుదల జాలిలేదు

నాగరికత మైలపడిన దుప్పటిలా నన్ను కప్పుకుంది
నాకందని ఏదో రహస్యం
నన్ను వశం చేసుకుంది.

పాముకోర డేగరెక్క ఈ కాలానికి చిహ్నం
పూలతేనే నెమలిరెక్క ఒక మిథ్యా ప్రమాణం

నా ప్రవృత్తి పసుపు వన్నెల పెద్దపులిలా పరచుకుంది
ఏదో విపత్ దూరంగా మబ్బులలో దాగివుంది.

ఈ రాత్రి సామి దగ్ధమైంది
ఈ ధాత్రి నిస్తబ్ధమైవుంది.
హేమగాత్రి నీ చరణమంజీరం నిస్వనింపదు
నాలోపల ఆశామందారం కిసలయింపదు.

–1944

★ ★ ★

# వాన కురిసిన రాత్రి

చినుకు చినుకుగ వాన కురిసినటు
నిశికి
సన్న చీకటి దోమ తెర కట్టినటు
చలి చలిగ గాలి
చెట్ల ఆకులదూరి కప్పు బెకబెకల తేలి
చూరులో నిదుర తూలి
గుండెకొసలకు మెల్లగా జారినటు
కప్పుకొను దళసరి దుప్పటిలో
వెచ్చ వెచ్చని మనసులో పొరలివచ్చు
నిదురలో చినుకు రాలినటు
కలలు జారు సవ్వడి
ఆ రోజు సాయంత్రమమ్మిన మల్లెపూలు
ఆమె సిగదాల్చి నవ్వినటు
నా యెదలు తగిలినటు
కాలమే కరిగినటు
ఆకసము వణికినటు
ఏదో అనిపించి సగము తెరచిన కనుల
కెదురుగా
గదిలోన దీపశిఖ కదలు నీడల నడుమ
మదిలోన తొలి కోర్కె మసక నిద్దుర నడుమ
చినుకు చినుకుగ వాన కురిసినటు
సన్న చీకటి దోమ తెర కట్టినటు

గదిలోన దీపశిఖ కదలు నీడల నడుమ
ఎర్రనై ఏకాంత సరస్సున విరిసిన
ఎర్రకలువ యటు
తీరని కోరికటు

తెరచిన విరహిణి నయనమట
కదలు నీడల మధ్య గదిలోన దీపశిఖ
కదలు కలల బంగరు వలల
రంగు రంగుల బొరుసు లాడించు చేప
చేపలకు తగిలి మెరిసిన నీరు
నీరువిడి చినుకు చినుకుగ వాన కురిసినటు
నిద్రవిడి మినుకు మినుకుగ స్పృహ మెరిసినటు

★ ★ ★

# పిలుపు

ధాత్రీ జనని గుండె మీది
యుద్ధపు కొరకంచుల ఎర్రని రవ్వలు
మీ రెవరైనా చూశారా
కన్నీరైనా విడిచారా

కోటి కోటి సైనికుల ఊడిపడిన
కనుగ్రుడ్ల అద్దాలలో ప్రతిఫలించే నిజాలను
మీ రెప్పుడైనా చూశారా
కన్నీరైనా విడిచారా

దరిద్రుని నోరులేని కడుపు
తెరుచుకొన్న నాలుక బూడిదలో వ్రాసుకున్న మాటలు
మీరెప్పుడైనా చూశారా
కన్నీరైనా విడిచారా

కాలం విరిగిన బండి చక్రంలా కదలలేక పడిపోతే
మొండిచేతుల మానవత్వం తెల్లబోయిన దీనదృశ్యం
మీరెవరైనా చూశారా
కన్నీరైన విడిచారా

ముడుచుకున్న కాగితపు గుండెలు చిరిగి పోకపోతే
అణచుకొన్న నల్లని మంటలు ఆకాశానికి రేగకముందే
మీరిప్పుడైనా మేల్కొంటారా
చీకటి తెరలను చీలుస్తారా
ప్రభాత విపంచిక పలికిస్తారా?

–1942

* * *

# భూలోకం

"అస్థిమూల పంజరాలు
ఆర్తరావ మందిరాలు
ఏ లోకం తల్లీ,
ఏవో బాష్పజలాలు?"

"కూడులేని లోకంయిది
గుండెలోతు తాపంయిది
సోమయాజి శాపంయిది
భూమి అడుగు లోకంయిది"

"ఘటచ్ఛటా శబ్దమేమి
చక్రాలకి రక్తమేమి
ఏం లోకం తల్లీ – యిట
కనుపించదు కాలనేమి?"

"ఆవులించు యంత్రశాల
చక్రంలో చిక్కుపడ్డ
మనిషి గుండె ఏడ్చిందట!
కనుపించదు అబ్బీ – యిట
తెరలోపలి కాలనేమి."

"దారిపొడుగు జనశవాలు
జారిపడే చేయికాలు
ఏలోకం తల్లీ – యిట
ఎగిరిపడే రాబందులు?"

"వంగదేశ క్షామం యిది
వ్యంగ్యభాష క్షేమం యిది
పరప్రభుత్వ దానం యిది
ధనికలోక ధర్మం యిది

కాలు కడుపు యిమ్మన్నది
గాజుమేడ లేదన్నది.

అన్నపూర్ణ కంటిముందు
కనపడినది రక్తబిందు
ఇది కలికాలం అబ్బీ -
కళ్ళులేని పాపం యిది".

"ఒకే రకపు తోలుబొమ్మ
లొకేవైపు ఒకే నడక
ఎక్కడికే తల్లీ - యిట
ఏదో కత్తుల నది"

"మృత్యువనే మైదానం
శత్రువనే అజ్ఞానం
యీర్ష్యలోని ఒక దాహం
సంధ్యలాంటి సందేహం
పిలిచికొన్న ఒక సైన్యం
తిరిగిరాని ఒక దైన్యం
ఇది యుద్ధం అబ్బీ - యిపు
డింట యింట ఆక్రోశం
వీరికి మిగిలే దొక బాష్పం".

"కూడులేని లోకం యిది
గుండెలోతు తాపం యిది
సోమయాజి శాపం యిది
పెద్దలున్న మిద్దెలున్న పాపం యిది;
అడుగునున్న అడుసుతిన్న లోకం యిది.

ఇది భూలోకం అబ్బీ - యిట
అస్థిమూల పంజరాలు
ఆర్తరావ మందిరాలు
పలుకలేని గులకరాళ్ళు!" *–1945*

★ ★ ★

బెంగాల్‌లో 1941 నుంచి అనావృష్టి, తుపానులు, యుద్ధంవల్ల క్రమంగా కరువు పరిస్థితి తీవ్రం అవుతూ 1943 నుంచి భయంకరమయిన కరువు, అంటువ్యాధులు బెంగాల్‌ని మృత్యుముఖంలోకి నెట్టాయి. 10 లక్షల మందికి పైగా మరణించారు. 1945 దాటాక గాని పరిస్థితి మెరుగుపడింది కాదు.

# యుగళ గీతిక

కిటికీ అవతల
కుండీలోని పూలమొక్కలు
పచ్చని ఆకుల పచ్చివాసనలు;
ఆకాశపు వంపువద్ద
తెలిమబ్బుల వలయంలో
మెరుస్తూన్న ఆర్ద్ర;
నలిగిన కిటికీ
రంగుచారల తెరల సందులనుండి
వీచేగాలులు చల్లని కన్ను రెప్పల కదలికలు;
గోడమీద భారంగా
వంగిన పటాలు;
పేజీలు ముడుచుకొని పడుకొన్న
బీరువాలోని పుస్తకాలు;
కుర్చీ, గుండ్రబల్ల, ఇస్త్రీ మడతల దుస్తులు
సగం తెరిచిన సూటుకేసు;
ఒలికిన అత్తరు సుతారపు సువాసన;
గదిలో చీకటిలో
చిటిలిన తారలట్లు
సగం కాలిన అగరువత్తుల కొసలు,
ఆరిపోయిన హరికేన్ లాంతరు
దీపపు వత్తి చివర నిద్రపోయే నిప్పురవలుసు
మరువం, దవనం
మల్లెచెండ్లు మేల్కొల్పిన
వెచ్చని తొలివేసవి జాగృతి;
పందిరి మంచంపైన
ఆమె చిరునవ్వులో
కవిత్వంలాంటి కొత్తదనం మెరిసింది

ప్రేమవంటి
స్నేహంవంటి
ఆమె కన్నుదల జాలివంటి ఆనందంవంటి
ముగ్ధమైన స్నిగ్ధమైన
ఆకర్షణ;
కామంవంటి
కైపువంటి
అనాది అనాది కాంక్షా తప్తమైన
నెత్తుటిలో ఒక తొందర;
కౌగిలి ఒదిగిన పెదిగిన ఒక నిట్టూర్పు
గడియారపు డయల్ మీది
రేడియమ్ అంకెలు
చీకటి మార్జాలపు పచ్చని కళ్ళు!
కిటికీ అవతల
ఒక వెన్నెల బిందువు
కొబ్బరి మొవ్వలోనికి జారినట్లు
వినపడీ వినపడని చప్పుడు!

–1955

★ ★ ★

# ఆ రోజులు

ఆ రోజుల్ని తలచుకున్నప్పుడల్లా
ఆనందంలాంటి విచారం కలుగుతుంది
నేటి హేమంత శిథిల పత్రాలమధ్య నిలచి
నాటి వాసంత సమీర ప్రసారాల తలచి
ఇంతేగదా జీవితం అన్న చింత
ఇంతలోనే ముగిసిందన్న వంత
చెమ్మగిలే నా కళ్ళని ఎవరైనా చూస్తారేమో అని
చెదిరిన మనస్సుతో యిటు తిప్పుకుంటాను
పచ్చని పచ్చికల మధ్య
విచ్చిన తోటల మధ్య
వెచ్చని స్వప్నాల మధ్య
మచ్చికపడని పావురాల మధ్య
పరువానికి వచ్చిన ఆడపిల్లల మధ్య
పరుగెత్తే నిర్ఝరుల మధ్య
తెరలెత్తే మునిమాపుల మధ్య
ఇప్పటికీ చూడగలవు నా తొలి యౌవనపు గుర్తులు
ఇప్పటికీ వినిపిస్తవి నాటి స్వప్న వంశీరవమ్ములు
కాలవ గట్టునున్న ఈ కడిమిచెట్టుకు తెలుసు
మనం చెప్పుకున్న రహస్యాలు
ఊరి చివరనున్న మామిడి తోపుకు తెలుసు
మనం కలలుగన్న ఆదర్శాలు
ఇంటి వెనుకనున్న ఎర్రగన్నేరుకు తెలుసు
చిక్కబడుచున్న సంజె చీకట్ల చాలులో
కలసిన పెదవుల నిశ్వాసాలు
అందాన్ని చూసినప్పుడల్లా స్పందించిపోయాం
బాధను కని కరుణతో కన్నీరు విడిచాం
శత్రువెదురైతే కండలపైకి చొక్కా చేతులు మడిచాం

పారిజాతపు పువ్వుల్లాంటి నవ్వుల్ని విరజిమ్ముకుంటూ
ప్రతి వీధినీ ప్రతి యింటినీ ప్రతి గుండెనీ శోభింపచేశాం
అమాయకమైన కళ్ళతో బాధ్యతలు లేని బలంతో
స్వచ్ఛమైన స్వేచ్ఛతో ఉషఃకాంతివంటి ఊహతో
భవిష్య దభిముఖంగా సుఖంగా సాగిపోయాం.

ఎన్ని రకాల రంగు రంగుల పువ్వుల మాలలు
కిటికీలకు మెరిసే గాజుగొట్టాల జాలరులు
నేలమీద మొఖమల్ తివాసీలు అత్తరు గుబాళింపులు
జవరాళ్ళ జవ్వాడే నడుములపై ఊగే వాల్జడలు
బాధ్యతలేని అధరాల చిటిలే నవ్వుల వైడూర్యాలు
ప్రతీ ఒక్క నిముషం ఒక్కొక్క ఒమార్ ఖయ్యాం
రుబాయత్ పద్యాలవంటి రోజులవి ఏవి ప్రియతమ్
చప్పుడు కాకుండా ఎవరు హరించారు మన పెన్నిధిని
నీతులు నియమాలు తాపత్రయాల కత్తుల బోనులో
నిలిచి నిలిచి తిరిగే ఎలుగుబంటివంటి మనం
డేగలాంటి ఆ చూపుని ఆ వుసురుని ఆ ఎత్తుని
మబ్బులాంటి ఆ పొగరుని మైకాన్ని స్వర్గ సామీప్యాన్ని
తిరిగి పొందలేమన్న సంగతి నాకు తెలుసు

కాని
నేటి హేమంత శైత్యానికి గడ్డకట్టుకున్న నా వెనుక
నాటి వాసంత విహారాల జాడలున్నవన్న తృప్తి
మాత్రం మిగిలి
ఒక్క జీవకణమైన రగిలి
శాంతిని పొందుతుంది నా మనస్సు
నా భావి తరానికి నిలుస్తుంది
పవిత్రమైన వీని ఆశీస్సు.

*–1955*

★ ★ ★

# కవి వాక్కు

భారతదేశాన్ని కాదనలేను
రష్యాదేశాన్ని కొలవలేను
నిజం ఎక్కడో – అక్కడ నా ప్రాణం వుంది
హృదయం ఎక్కడో – అక్కడ ఉదయం ఉంది.

పులి చంపిన లేడి నెత్తురు పులుముకోలేను
ఖడ్గ మృగోదగ్ర విరావం ఆలకించలేను
జగద్ధాత్రి! నీ కుమారులమైన మేము
తత్వాల పేర విప్లవాల పేర ఒకరి నొకరం హతమార్చుకోలేము!

శాంతికోసం యుద్ధాన్ని ప్రజ్వలింప చేస్తారు
సుఖం కోసం ఆ రక్త విప్లవాన్ని తరింపచేస్తారు
శ్మశాన భూమిని వికసిస్తుంది మీరు నాటిన పూలచెట్టు
కాని ఎవరు తుడుస్తారు తల్లీ! నీ కన్నీటిబొట్టు?

ప్రభువులనే కిరాతకులకు అమ్మనన్నాడు బమ్మెర పోతన!
పార్టీలకు అమ్ముడుపోయిన నేటి కవులకు లేదు వేదన!
మాటల మేజిక్కు నమ్మి, పాటల మ్యూజిక్కు నీలో క్రమ్మి
మరచిపోకు అసలువాణ్ణి నీ సోదరుడైన మానవుణ్ణి.

వంచలేను నా శిరస్సు ఏ అధికారంముందు
ఒప్పలేను మానసిక దాస్యాన్ని ఏ ప్రభుతయందు
నాకు వద్దు మీ రంగురంగుల కాగితపు బురఖాలు
పాత వుచ్చులు తీసి తగిలించకు వినూత్న శృంఖలాలు!

ఒక సత్యంతో మరో సత్యాన్ని ఖూనీ చెయ్యకు
పరదేశ స్తుతిలో స్వకీయ సంస్కృతి విస్మరించకు
ఇంకా కరిగి నీరైపోలేదు హిమాలయ శిఖరాలు
ఇంకా మరచిపోలేదు తథాగతుని మహాత్ముని ప్రవచనాలు!

వివేకంలేని ఆవేశం విపత్కరమౌతుంది
సంయమనంలేని సౌఖ్యం విషాదకారణ మౌతుంది
సమ్యక్ సమ్మేళనం లేని తౌర్యత్రికం కఠోరమౌతుంది
కరుణలేని కవివాక్కు సంకుచిత మౌతుంది!

*(ఆంధ్రపత్రిక దినపత్రిక, ఆదివారం సంచిక
జనవరి 23, 1955)*

★ ★ ★

# ప్రకటన
## (పరారీ అయిన వ్యక్తి కోసం)

స్టేషన్లో టిక్కెట్లను జారీ చెయ్యకండి
ఎక్కడి రైళ్ళు అక్కడ ఆపివెయ్యండి
దేశదేశాలకి కేబుల్‌గ్రామ్స్ పంపించండి
దేవాలయాల్లో నిత్యం పూజలు చేయండి.

ఆకాశవాణిలో యీ విషయం ప్రకటించండి
కాఫీహోటళ్ళలో క్లబ్బులలో కర్మాగారాల్లో
కాస్త జాగ్రత్తగా నిశితంగా పరిశీలించండి
సముద్ర తీరాలలో నదీ జలాలలో వెదకండి.

సాయుధ దళాల్ని దిక్కులలో నిలబెట్టండి
రాకెట్లను అంగారకాది గ్రహాలకు పంపించండి
అడుగుజాడల్ని కూపీ తియ్యండి
వ్రేలి ముద్రల్ని పరీక్షించండి.

ప్రజలు తండోపతండాలుగా విరగబడుతున్నారు
కంగారుతో భయంతో గుసగుసలాడుతున్నారు
విజ్ఞానవేత్తలు నాగరికత పైతోలు వొలుస్తున్నారు
మనుష్య భక్షకులు నేడు చంకలు కొట్టుకుంటున్నారు.

కావ్యచర్చలు కళాలయాలు ఆకర్షించటం లేదు
రాజకీయవేత్తల ఉపన్యాసాలు ఎవరూ వినడం లేదు
సైంటిస్టులు ఒక్కొక్కరే ఆత్మహత్య చేసుకుంటున్నారు
స్వార్థజీవనులు గభాలున రొమ్ములు బాదుకుంటున్నారు.

సిద్ధాంతాలు చర్చలు ఎవరూ చేయడం లేదు
సిరా యింకకుండానే ఎగ్రిమెంట్లు చింపేస్తున్నారు

అతృప్త అశాంత ప్రజా పారావార తరంగం
అంచుల్ని దాటి భీకరంగా విరుచుకు పడుతోంది.

ఇంక చరిత్రలు వ్రాయనక్కరలేదు
ఇంక రాజ్యాలు పాలించ నక్కరలేదు
అణుబాంబు యుగాంతాన్ని నిరూపిస్తున్నది
ఆ ముహూర్తం త్వరలోనే వస్తున్నది.

కాబట్టి స్టాండ్ ఎటెన్షన్ – మన జాతిని మనం
కాపాడుకోవాలంటే ఒక్కటే మార్గం
వెతికి తీసుకురండి పరారీ అయిన వ్యక్తిని
వేరు దారిలేదు కదలండి కదలండి జై అని.

అపార కృపా తరంగితాలైన నయనాంచలాలు
ఆనందం జాలువారే స్నిగ్ధ దరహాస పరీమళాలు
సంస్కారపు కేశపాశంలో తురిమిన అనురాగపు గులాబి
సదా ప్రజా హితైషిణి సుభాషిణి గర్వంలేని రాణి
కల్లనీ క్రౌర్యాన్నీ కాలుష్యాన్నీ తిరస్కరిస్తుంది
తెల్లని పావురాళ్ని సరదాగా ఎగరేస్తుంది
చల్లని తల్లి చక్కని చెల్లి ఆమె పేరు శాంతి.

*–1950*

★ ★ ★

# ఆర్తగీతం

నా దేశాన్ని గూర్చి పాడలేను, నీ ఆదేశాన్ని మన్నించలేను.
ఈ విపంచికకు శ్రుతి కలుపలేను,

ఈరోజు నాకు విషాదస్మృతి, విధి తమస్సులు మూసిన
దివాంధరుతి
నా యెడద మ్రోడైన ఒక దుస్థితి.

నీ క్రొత్త సింగారమ్ము వలదు, ఉదాత్త సురభిళోత్త
శయ్యాసజ్జితమ్ము వలదు,
రసప్లావితము వలదు.

చిత్ర శిల్ప కవితా ప్రసక్తి వాంఛింపను, తత్వసూత్ర
వాదోక్తి చలింపను,
సుందర వధూ కదుష్ణ పరీరంభముల రసింపను,

గత చారిత్రక యశఃకలాపమ్ము వివరింపకు, బహుళ
వీరానేక గాథాసహస్రమ్ము వినిపింపకు
ఇంక నన్ను విసిగింపకు.

నేడు నేను కన్నీరుగా కరిగిన గీతికను, సిగ్గుతో రెండుగా
చీలిన వెదురు బొంగును,
మంటలో అంతరాంతర దగ్ధమైన బూడిదను.

పైన దైవమునకు, కింద మానవునకు జవాబు చెప్పవలసిన వాణ్ణి
రసాతల మంట శిరస్సు వంచినవాణ్ణి

ఈ రోజు నేను చూసినదేమి? విధి యిన్ని కత్తులను
దూసినదేమి
జాగృతి పోతి వాదరల రుధిరమేమి?

నేను చూశాను నిజంగా ఆకలితో అల్లాడి మర్రిచెట్టు
కింద మరణించిన ముసలివాణ్ణి;

నేను చూశాను నిజంగా నీరంధ్ర వర్షాన వంతెనకింద
నిండు చూలాలు
ప్రసవించి మూర్చిలిన దృశ్యాన్ని!

నేను చూశాను నిజంగా తల్లిలేక తండ్రిలేక తిండిలేక
ఏడుస్తూ ఏడుస్తూ

ముంజేతుల కన్నులు తుడుచుకుంటూ మురికికాల్వ
పక్కనే నిద్రించిన మూడేళ్ళ పసిబాలుణ్ణి;

నేను చూశాను నిజంగా పిల్లలకు గంజికాసిపోసి
తాను నిరాహారుడై

రుద్ధబాష్పాకులిత నయనుడై ఆఫీసుకు వచ్చిన వృద్ధుని
ప్యూన్ వీరన్నని;

నేను చూశాను నిజంగా క్షయగ్రస్త భార్య యిక బతకదని
డాక్టరు చెప్పినపుడు
ప్రచండ వాతూల హత నీపశాఖవలె గజగజ
వణికిపోయిన ఆరిక్త అశక్త గుమాస్తాని
అయిదారుగురు పిల్లలు గలవాణ్ణి;

నేను చూశాను నిజంగా మూర్తీభవత్ దైన్యాన్ని, హైన్యాన్ని,
క్షుభితాశ్రు కల్లోలనీరధుల్ని, గచ్ఛత్ శవాకారవికారుల్ని

ఇది ఏ నాగరికతకు ఫలశ్రుతి? ఏ విజ్ఞాన ప్రకర్షకు ప్రకృతి?
ఏ బుద్ధదేవుడి జన్మభూమికి గర్వస్మృతి?

ఇంక నన్ను నిర్బంధించకు నేస్తం ఈ రాత్రి నేను
పాడలేను; ఈ
కృత్రిమ వేషాన్ని అభినయింపలేను
మానవత లేని లోకాన్ని స్తుతింపలేను
మానవునిగా శిరసెత్తుకు తిరగలేను
ఈ నాగరికతారణ్యావాసం భరించలేను.

ఒక్క నిరుపేద వున్నంతవరకు, ఒక్క మలినాశ్రు
బిందు వొరిగినంత వరకు,
ఒక్క క్షేగు ఆకలి కనలినంతవరకు

ఒక్క శుష్కస్తన్య సన్నిధిని క్షుధార్తి నేడ్చు పసిపాప
ఉన్నంతవరకు,

ఒక్క తల్లి నీరవాక్రోశ రవమ్ము విన్నంతవరకు,
ఒక్క క్షత దుఃఖిత
హృదయ మూరడిల్ల నంతవరకు,

నాకు శాంతి కలగదింక నేస్తం, నేను నిగర్వినైనాను,
ఈ సిగ్గులేని ముఖాన్ని,
చూపించలేను.

ఈ గుండె గూడుపట్లు ఎక్కడో కదలినవి, ఈ కనులు
వరదలై పారినవి,
ఈ కలలు కాగితపు పేలికలై రాలినవి.

ఈ ఆర్తి ఏ సౌధాంతరాలకు పయనింపగలదు?
ఏ రాజకీయవేత్త గుండెలను
స్పృశించగలదు? ఏ భోగవంతుని
విచలింప చేయగలదు? ఏ భగవంతునికి
నివేదించు కొనగలదు.....?

–1956

★ ★ ★

# కాయ్ రాజా కాయ్

కాయ్ రాజా కాయ్
కాస్తేవుంది చూస్తేలేదు
మూడు ముక్కలాట
మూడాసులు తిప్పు
ధనం నీది సుఖం నీది
ఘనత నీది వనిత నీది
మళ్ళీ కలిపి పంచు
కళ్లు నులుముకు చూడు
ఆట కలవలేదు
రక్తి కట్టలేదు
ధనం సుఖం ఘనత వనిత
చేతులు మారినై నీ
ఆశలు కూలినై
ధర్మరాజా
ఇక అరణ్యావాసం నీకు గతి
దుర్యోధన సార్వభౌమా
ద్రౌపది యిక నీ ఖైదీ
కాయ్ రాజా కాయ్
కాస్తేవుంది చూస్తేలేదు

ఒకటికి మూడురెట్లు
స్వర్గానికి లే మెట్లు
క్షణంలో సగంలో నువ్వు కుబేరుడివి
కనురెప్ప పాటులో కుచేలుడివి
బొమ్మ తగల్లేదు రెమ్మ విరగలేదు
బోర్లపడిన అదృష్టాన్ని
భుజాన వేసుకుపో
ఊపిరాడని గదిలో

ఉరిపోసుకు చనిపో
అసలు సంగతి యిది
పేక ముక్కలు కలిపి పంచినా
ఆసు రాజు నీ చేతిలో కొచ్చినా
జోకర్ అవతల వాడిది
జయం అవతల వాడిది
జోకర్ అదృష్టానికి చిహ్నం
రెండు రాత్రుల మధ్య పగలు
శరపరంపర మధ్య డాలు
తెరచాప లేని పడవకి వాలు
ఆశ వదులుకున్న ప్రతివానికి
ఎడారిమధ్య కనపడిన గని
ఆజీవిత బ్రహ్మచారిని
హఠాత్తుగా కౌగిలించిన జవ్వని
వెతికిన చోట కనబడదు
వేరుచోట కాలికి తగుల్తుంది
రైలుకింద తల పెట్టిన నిర్భాగ్యునికి
జోకర్ దొరకలేదు
ఆఖరు మలుపులో నియంత
హిట్లరుకి జోకర్ దొరకలేదు
ఆఖరికి కలుపులో రష్యన్ బెరియాకి
జోకర్ దొరకలేదు
రోమియో జూలియట్లకు
లైలా మజ్నూలకు
లక్షలాది స్వాప్నిక జీవులకు
సామాన్యులకు సాహసికులకు
ప్రతి నిముషం భంగపాటు
ప్రాణాలకు ఎడబాటు
నిత్యం నిను కవ్వించే అదృష్టం
నెరజాణ అయిన సుందరాంగి
కనుసైగతో నిన్ను చీరి
చిరునవ్వుతో నిన్ను చేరి
చివరకు దబాలున చీకట్లో యేట్లో
నిను వదిలేసే చిత్రాంగి

అరచేతిలోని రేఖల వ్యాఖ్యలు
నిజమైనా కాకపోయినా
ఆ సమయాన లగ్నాధిపతి
కుజుడైనా గురుడైనా ఎవడైనా
ఎక్కడో ఎప్పుడో ఒకసారి
నీ బ్రతుకులో అదృష్టం నవ్వుతుంది
అప్పుడు

నువ్వు నడచేదారిలో ఆకాశం
మోకరిల్లి నక్షత్రాల్ని జల్లుతుంది
నువ్వు చూచే
సుదూరాలలో
పడుచు లేడురంగు రంగుల సొగసు
లెగురవేస్తారు
అప్పుడు

నువ్వు సంగీతపు కలనేత వస్త్రాలు
సరదాగా ధరిస్తావు
ఆనందపు చలువ జ్యోత్స్నలోంచి
అంతా అందంగా కనిపిస్తుంది.
అందుకే

న్యాయానికీ ధర్మానికీ
నీతికీ కట్టుబడిన వాళ్ళందరూ
నాలుక పిడచకట్టుకు పోతూ
ఎడారి దారుల పోతూవుంటే
ఒక హంతకుడు ఉరిశిక్ష తప్పి

ఊయాల లూగుతాడు
ఒక దురహంకారి నిముషాని
కొక పాకిస్తాన్ సృష్టిస్తాడు
ఒక వినాయకుడు నాయకుడై
జోహార్లు అందుకుంటాడు
అదృష్టపు గెడసాని అపాంగ
వీక్షణ ఎవరికి ఎవరికి

క్యూలో నిలబడండి జనులారా
ముసలివాడు మూర్ఖరోగి
మొద్దు ఎద్దు మానవుడు దానవుడు
అందరూ స్వయం వరానికి రావచ్చును
అర్హత లవసరంలేదు
కాయ్ రాజా కాయ్
కాస్తేవుంది చూస్తేలేదు

ఒకటికి మూడు రెట్లు
స్వర్గానికివే మెట్లు
క్షణంలో సగంలో కుబేరుడివి
కనురెప్ప పాటులో కుచేలుడివి
బెదిరిపోకు భీతావహాలకిచట స్థానంలేదు
బెదురుగుండె సరితీసుకు
మండే అగ్నిగుండాన దూకు
చివరికి మిగిలిన బూడిదలో
చిన్న మెత్తు స్వర్గం దొరకదు
చినిగిన స్వప్నపు సంచిలో
చితికిన బాష్పం నిలవదు
అందుకే నేస్తం జీవితమే ఒక జూదం
ఖేదానికి మోదానికి లేదసలే భేదం.

–1942

★ ★ ★

# గొంగళి పురుగులు

బల్లపరుపుగా పరచుకొన్న జీవితం మీద నుంచి
భార్యామణి తాపీగా నడచివచ్చి అందికదా –
"పంచదార లేదు
పాల డబ్బా లేదు
బొగ్గుల్లేవు – రాత్రికి
రగ్గుల్లేవు."

రోజూ పాడే పాత పాటకి
రోజూ ఏడ్చే పాత చావుకి
విలువలేక, వినికూడా కదలకుండా గొంగళీ పురుగు
సగం సగం తిన్న కలల్ని నెమరేస్తూ నిద్రపోయింది

రోజూ ఆవకాయ తిన్నట్లు
రొటీన్ అలవాటైన
బల్లపరుపు జీవితంకింద కాషస్‌గా దాచిన
కోర్కెల సీక్రెట్ బాక్సులోంచి తీసి
ఉద్రేకాన్నీ, సెక్సునీ, శృంగారాన్నీ
క్రైమ్‌నీ, షాక్‌నీ, లాటరీ కాగితాల్నీ
చాటుగుండా చూసుకుని, నవ్వుకుని మీసం మెలేసుకుని
మాట్లాడకుండా జెంటిల్మన్‌లా మత్తుగా పడుకుంది గొంగళీ పురుగు

బస్‌స్టాప్ దగ్గర పరాయి ఆడది తనకేసి చూసిందని
మెరీనా కాంటీన్ యివతల నుంచుంటే మినపట్టు వాసన ఘాటుగా వేసిందని
అసలు అప్పుడే కాంగ్రెసులో చేరివుంటే ఈపాటికి మినిస్టర్ని
అయిపోయి ఉండేవాడినని
పెళ్ళాం దగ్గర చెప్పాలని సర్దాపడి
"హయ్యోరామ నీ బతుక్కి" అన్నట్టు మూతివిరిచే
అర్ధాంగి ఆకారం తల్చుకుని

ముడుచుకుపోయిన గొంగళీ పురుగు
తన్ని తనే తీసుకుని గోడ అవతలికి
తన్ని తనే గిరవాటేసుకుంది.

భూకంపం వచ్చిందన్నా
మరో యుద్ధం రేగిందన్నా
తన భార్య కవలల్ని కన్నదన్నా
కంగారు పడక కోటు తొడుక్కుని
కోటీశ్వరరావు ఆఫీసుకెళతాడు, వస్తాడు.

రాత్రి రెండో ఆట సినిమా చూసి
రత్తమ్మ యింటి ముందాగిన రిక్షాలోంచి
దిగిన జరీ కండువా పెద్దపులి జేబులోంచి పడిన
పర్సు తీసి జాగ్రత్త పెట్టి
అక్కడే వెయిట్ చేసి
తిరిగి ధోవతిని సరిచేసుకుంటూ తూలుతూ వచ్చే
పెద్దపులి చేతికి యిచ్చి
"థ్యాంక్సూ" అనే పదాన్ని సంపాదించుకుని, సంతోషించుకుని
వీపుమీద మోసుకుని వెళ్ళిపోతాడు వీరేశ్వరరావు.

ఆఫీసరు వస్తే సాల్యూట్ చేస్తుంది కుడిచెయ్యి
ఆకలేస్తే గబ గబ రాస్తుంది కుడిచెయ్యి
జేబులోంచి సెకండుహాండ్ సిగరెట్టు ముక్కల్ని తీస్తుంది కుడిచెయ్యి
అయితే ఇక ఎడమచెయ్యి ఉపయోగ మేమిటంటావా?
నవ్వుకుంటూ ఎలక్ట్రిక్ స్తంభాన్ని ఆనుకుని షాక్ తగిలి
నిరుపయోగంగా చచ్చిపోతాడు వీరేశ్వర్రావు...

బ్లాక్ మార్కెట్‌లో బియ్యం, బ్రాకెట్లు ఓపెనింగులు, క్లోజింగులు
థియేటర్లో కొత్త సినిమా, కాఫీహోటల్ రేడియోలో లతా
రోడ్డుమీద ఖరీదైన కార్లు, ఎన్నికల్లో నెగ్గినవాడి ఊరేగింపు
కేకలు, కోకలు, మూకలు ముసిరిన బజారు రోడ్డమ్మట
వీనులుండి వినలేక, కళ్ళుండి చూడక నిటార్గా నేరుగా
యోగీశ్వరుడిలా నడుస్తాడు జోగేశ్వరరావు.

చిన్నప్పటి ఆదర్శాలు అహంకారాలు నశించి
గోడమీద గ్రూప్ ఫోటోలు, బియ్యే డిగ్రీలు కృశించి

నిత్యనైమిత్తిక మృద్భిత్తికల గుళ్లుకట్టి
సంఘ గౌరవ దైవతముల్ని ప్రతిష్ఠించి
రసహీనమైన తమ జీవితాన్ని నివాళించి
నీడలమాటున పీడకలల చాటున నీరసంగా నుంచుని
చనిపోయిన కోర్కెల్ని పాతిపెట్టిన శ్మశానాల దాటుకుని
అలవాట్ల ఆచారాల రైలుపట్టాల మీదనే దొర్లుకుని, దొర్లుకుని
చిన్నప్పుడు తెలియక చేసిన తప్పుకు రోగాలు మిగుల్చుకుని
యౌవనంలో వృద్ధాప్యాన్ని తగుల్చుకుని
భయాల చాటున, ఏడుపుకొండల మాటున
గుమాస్తాలు టీచర్లు చిన్న చిన్న సంసారులు
కోటీశ్వరరావులు వీరేశ్వరరావులు గొంగళి పురుగులు
లక్షలు లక్షలు.

విసుగెత్తి చివరికి గొంగళీ పురుగులు
బల్లపరుపుగా పరచుకున్న తన జీవితాన్ని పరుపుచుట్టలా చుట్టి
ఆత్మహత్య చేసుకుందామని అనుకుంటుంటే
పెళ్ళాం మాట వినబడి, బాస్ కేక వినబడి
భయంతో గజగజ వణుకుతూ
తిరిగి తన జీవితాన్ని బల్లపరుపుగా పరుచుకుని
దానిమీద నిద్రపోయింది గొంగళీపురుగు
సగం సగం తిన్న కలల్ని నెమరేస్తూ
సగం సగం చచ్చిన ప్రాణాల్ని జోకొట్టుతూ.

*–1958*

★ ★ ★

# అద్వితీయం

నామీద నీ చూపు చీకట్లు ముసురుకుని
నీమీద నా రూపు వెన్నెలలు పరచుకుని
నా కలల నీ పెన్నెతుల అల లొక్కపరి పొంగి
నీ కనుల నా కాంక్ష లాసజ్య ధనువులై
నా గుండె నీ పాట బాడబమ్మై రేగి
నీ తనువు నా కౌగిలిని తటిద్గానమై సాగి
అటు కాల మిటు విశ్వమొక్క త్రుటిలో ఎదిగి,
ఇటు నా బ్రతుకు కొసల నీవు నీ బ్రతుకు మొదల నేను

నీవు నా ఆశ కవధివై నేను నీ స్త్రీత్వమున కాహుతినై
నా బ్రతుకు పచ్చనిగట్ల నీవు మిన్నాగువై చుట్టుకుని
నీ స్త్రీత్వంపు నెత్తుటిబొట్ల నేను ఎరు పెరుపు రూపమ్ము దాల్చుకుని
నీవీ భీకర మధ్యాహ్న ఆతపమ్మున నాలోని పురుషత్వమ్ము వెదకికొని
నేనీ శరత్పూర్ణిమలనీ నగ్నలాలస నిమ్నగలనీ నీదుకొని
ఓ ఋతురాజ్ఞి నా తనువెల్ల నీ అనుకూల పవనములు వీచి
ఓ సురవేణి నీ క్రతు హోమగుండమున నా జీవితమునే వ్రేల్చి
నీలో కొలది కొలది నశించు నాలో తరతరమ్ముల వికసించి
నాలో ఒదిగి ఒదిగి ఆక్రమించు నీలోపలనే కదలి పునరుద్భవించి
ఇది సృష్టి
ఇది మిథస్సమాశ్లేష చరిత తను యష్టి
నేనొక పరమేష్టి ఇది నీవు ఇది నేను ఇరువురము ఒకటైన యీ నిమేషమ్ము
విశ్వరహస్యమ్ము

*–1958*

★ ★ ★

# నీవు

"ఇన్ని నే బ్రతికిన దినాల పన్నిన వ్యూహాన
నిన్నెక్కడ కలసికొనినానో స్మృతికి రాదు గాని నీవు లే
వను నట్టి కాలమే నాకు లేదు; నా దారి నుండి నిన్ను
విడదీయు వేరు మార్గమే లేదు; నీవు కలసి
త్రాగని నేను త్రాగు మధుపాత్ర యన్నదియు లేదు;
చలికి తాళక వచ్చు నీ కొరకు స్థానమీయని ఆస్థాన మొకటి
నాకు లేదు; నా నిదురించు శయ్యాగృహమ్ము నీవు లేక
నాకు పచ్చి శూన్యమ్ము"--

"నా తలపు మొగలి పువ్వున గుచ్చి నిలిచినముల్లు నీవు;
నా బ్రతుకు దైనందినపు భోజనాన నీవు రుచివి;
నా యదృష్టపు తాళ్ళకొనల వైచుకున్న ముడివి నీవు;
నిన్ను ప్రేమించినాను, నిందించినాను, ద్వేషించినాను
నీ కొరకు చేతులు చాచినాను, పొమ్మని తల్పులు మూసినాను
కాని యిది యేమి?

నీవు లేని చోటున నాకు చోటులేదు, సుఖములేదు,
లేదు ఉనికి."

(ఎవరెస్ట్ లెనిన్ అనే కవయిత్రి పద్యానికి అనువాదం)

– *1957*

★ ★ ★

# ఒక శ్రుతి

ఒక శ్రుతి
ఒక గతి
వినబడును దూర దూరముల
దూర దూరముల
రేఖగా
పొలిమేరగా
కరిగి నిల్చిన నాలోన
ఒక శ్రుతి
ఒక గతి

గిరిపుత్రి కడగంటి
మణిదీప్తి విరిసికొని
హిమశైల శిఖరమ్ము
కటకమ్ము నొరసికొని
నాలోన
లోలోన
గుండెలను చుట్టుకుని
బ్రదుకునే మలుచుకుని
గళసీమ నవజాత
మకరంద ధారగా
మనసులో అరవింద
మోరగా వ్రాలగా
నాలోన
లోలోన
ఒక శ్రుతి
ఒక గతి

గగనపథ విష్ణుపద
భవ పవిత్ర స్వర్ధుని
దిగివచ్చి దిగివచ్చి
గంధర్వ సంగీత
ద్రుతవేగయై పేలయై
పాయలుగ విచ్చి
ఒక మెరుపు బంగారు కెరటమ్ము
విరిగి పడినటుల
నాలోన
కెరలి సుడి తిరిగి నటుల
ఒక శ్రుతి
ఒక గతి

ఒక లేత నెత్తావి చరణమ్ము
నా సుప్త సౌందర్య హృదయమ్ము
లో మెత్తగా మెల్లగా
నడచినటు పరుగిడినటు
ఝణం ఝణ క్వణ రవళి
గ్రుసనం దిరిగినటు
కుచ్చెళుల చెరగు లొరసికొని
బెరసికొని
తలపు చివరల మొరసినటు
నాలోన
లోలోన
ఒక శ్రుతి
ఒక గతి

చెరగి
నేను పుట్టిన పురిటి నొప్పుల చీకటిబాధ
చెరగి
నేను నశించి చావు సంజెల నెత్తుటిచార
చెరపికొని నీ మధ్య నా మధ్యగల దూరపు రేఖ
తెలిసికొని
నీ మధ్య నా మధ్య
వంగిన తారకల శాఖ

రేఖగా
పొలిమేరగా
కరిగి నిల్చిన నేను
నిర్వ్యాత దీప ని
శ్చలముగా నిలువగా
నిర్హేతు కానంద
నీరవగళాన పిలువగా
కిన్నరులు కొనగోట
వెండిచుక్కల మీట
పవడంపు దారాల భావాల నల్లుకొను
కలలొత్తి అలలొత్తి
కడలిలా పరుచుకొను
నాలోన
లోలోన
ఒక శ్రుతి
ఒక గతి

−1959

★ ★ ★

# తపాలా బంట్రోతు

"మైడియర్ సుబ్బారావ్
కనిపించడం మానేశావ్
ఏఁవిటీ – పోస్టుమాన్ మీద గేయం వ్రాయాలా!

అందమైన అమ్మాయి మీద కాని
చందమామ మీద కాని
వంద్యుడైన భగవంతుడి మీదకాని అ
వంద్యుడైన ధీర నాయకుడు మీద కాని
పద్యాలల్లమని మన పూర్వులు శాసిస్తే
ఎక్కడి పోస్టుమానో యీ గోల
ఈ సాయంత్రం వేళ

ధనవంతుణ్ణి స్తుతి చేస్తే
పది డబ్బులు రాలుతాయి
సచివోత్తముణ్ణి స్మరిస్తే
పదికళ్ళు మనమీద వాలుతాయి
ఈ నీ ప్రార్థన కడుంగడు అసభ్యం సుబ్బారావ్
ఉత్త పోస్టుమాన్‌మీద ఊహలు రానేరావు

మూడవ పంచవర్ష ప్రణాళిక
ఏడవ వన మహోత్సవ దినం
బిర్లా దాల్మియా
సినీమా దలైలామా
యుద్ధం పరమార్థం
రాజులూ రాజ్యాలూ, తారుమార్లూ
ఇటువంటివి చెప్పు
మరి చూడు నా తడాఖా

మృదు మాధ్వీ పదలహరీ
తరంగ మృదంగ విలసద్భృంగీ

మనోహరాలా కావ్యాల్ గేయాల్
కొల్లలుగా వ్రాస్తాను

కానీ, తపాలా బంట్రోతు మీదా
హవ్వ!
ఎండలో వానలో
ఎండిన చివికిన
ఒక చిన్న సైజు జీతగాడు
చెవిలో పెన్సిల్
చేతిలో సంచీ
కాకీ దుస్తులు
అరిగిన చెప్పులు
ఒక సాదా పేదవాడు
ఇంటింటికీ
వీధివీధికీ
ప్రతిరోజూ తిరిగేవాడు – ప్రైమ్మినిస్టరా ఏం

అయితే చూడు
ఆ కిటికీలో రెండు విచ్చిన కలువల్లాంటి కళ్ళు
ఆ వీధి మొగవైపే ప్రసరిస్తోన్న చూపుల ముళ్ళు
ఆ కళ్ళలో ఆత్రుత
ఆ గుండెల్లో గడచిన
దేశాంతర గతుడైన ప్రియుడి వార్తకోసం

అమ్మాయీ!
పద్దెనిమిదేళ్ళ పడుచుదనాన్ని భద్రంగా దాచి
పళ్ళెరంలో పెట్టి ప్రాణనాథుడి కందించాలనే
నీ ఆశ నాకు అర్థమయింది.

అందుకే
నీ చూపులు తుమ్మెద బారులు కట్టి
నీ కోర్కెలు గజ్జెలవలె ఘలంఘలించి
వీధి వీధినంతా మేల్కొలుపుతున్నాయి
వీధి వీధినంతా కలయచూస్తున్నాయి
అదుగో పోస్టుమాన్!

ఒక్క ఉదటున వీధిలోకి నువ్వు
అతని మొహంమీద లేదని చెప్పడానికి బదులు చిరునవ్వు
వెళ్ళిపోతున్న తపాలా బంట్రోతు వెనుక
విచ్చిన రెండు కల్హార సరస్సులు

గుడిసెముందు కూర్చున్న పండుముసలి అవ్వ
గడచిన బ్రతుకంతా కష్టపు నెత్తుటి కాలవ
కనపడీ కనపడని కళ్ళల్లో
కొడిగట్టిన ప్రాణపు దీపంలో
తాను కనిన తన ప్రాణం, తనకు మిగిలిన ఒకే ఒక స్వప్నం
తన బాబు తన ఊపిరి
అస్సాం రైఫిల్సులో సోల్జర్ సిమ్మాచలం
కోసం నిరీక్షణ

క్షణ క్షణ ప్రతీక్షణ
ఒక కార్డుముక్క వ్రాశాడా
బంట్రోతు వెళ్ళు వెళ్ళు త్వరగా
ముసలిదానికి మంచివార్త నందించు
ముడతలు పడిన మొహంమీద ఆనందాన్ని పరికించు
దూరభారాన ఉన్న కుమారుని కోసం
వగచే తల్లికి
చేరువచేరువౌతున్న నువ్వొక ఊరట
దగ్గర దగ్గరౌతున్న మిత్రుని లేఖకోసం
నిలిచిన తరుణుడికి నీ రాక ఒక బాసట
వర్తకుడికి నర్తకుడికి ఖైదులో దొంగకి హంతకుడికి
ఉద్యోగ శప్తుడైన నవీన యక్షునికి
మనిషికి రాక్షసునికి
నువ్వు
దూరాల దారాల్ని విచిత్రంగా
ఒకే నిముషము
అనే కండె చుట్టూ త్రిప్పగల నేర్పరివి – కూర్పరివి

అదృష్టాధ్వంమీద నీ గమనం
శుభాశుభాలకి నువ్వు వర్తమానం
నీ మేజిక్ సంచిలో

ఏ క్షణంలో ఏది పైకి తీస్తావో
ఆ క్షణాన నువ్వు రాజుతో సమానం!

కొందరికి పరిచయమైన నవ్వు
కొందరికి తలపంకించిన నవ్వు
కొన్ని వైపులకి చూడనే చూడవు
అందరికీ నువు ఆప్తబంధువువి
అందరికీ నువు వార్త నందిస్తావు
కాని నీ కథనం మాత్రం నీటిలోనే మథనం
అవుతూంటుంది.

ఇన్ని యిళ్ళు తిరిగినా
నీ గుండెబరువు దింపుకోవడానికి ఒక్క గడపలేదు
ఇన్ని కళ్ళు పిలిచినా
ఒక్క నయనం నీ కోటుదాటి లోపలకు చూడదు
ఉత్తరం యిచ్చి నిర్లిప్తుడిలాగ వెళ్ళిపోయే నిన్ను చూసినపుడు
తీరం వదలి సముద్రంలోకి పోతూన్న ఏకాకి నౌక చప్పుడు.

*–1959*

★ ★ ★

---

తంగిరాల వెంకటసుబ్బారావు అనే మిత్రుడు జిల్లా తపాలాశాఖ జరుపుకొనే వార్షికోత్సవానికి పోస్టుమాన్ మీద వ్రాయమని కోరినప్పుడు వ్రాసి యిచ్చిన గేయం.

# కఠినోపనిషత్

నీడల కొండచిలువలు వెలుతురు కుందేళ్ళను మింగి
సంఘపు మర్రిచెట్టును చుట్టుకొని మత్తుగా నిద్రపోయే సమయాన
మానవారణ్యంలోని పెద్దపులులు
జరీ కండువాలు, బిరుదాంకితమైన సువర్ణపతకాలు ధరించి
సిటీలో సభావేదికమీద కథాకళి నృత్యం చేస్తున్న కాలాన
సాయం విహారార్థమరిగే

చక్కని చుక్కల మినుకు మినుకు వెలుగుల్లో
చలిగాచుకునే పడుచువాళ్ళ
చప్పట్ల తప్పెట్లు మ్రోగే ముహూర్తాన
అతగాడు ఒక్కడూ ఊపిరాడని గదిలో
జిడ్డుతేరిన ముఖాన్ని కన్నీళ్ళతో టాయిలెట్ చేసుకుంటున్నాడు.

అర్ధరాత్రి థియేటర్లలో అర్ధనగ్న లాస్యానికి సెక్సీ హాస్యానికి
అమెరికన్ జాకెట్లు తొడిగిన బంగారు పిచ్చికలు కిచకిచలాడినపుడు
ఊరవతల సందులలో అంగళ్ళలో
విక్రయార్థం రంగేసిన రకరకాల మొగాళ్ళి పేరుస్తోన్నప్పుడు
యుద్ధాల్ని సృష్టించే మహానాయకులు
దేశాల సరిహద్దులలో నిలబడి
ద్వేషాల శతఘ్నులు పేలుస్తూన్నప్పుడు
అకాల మరణం పొందిన అనాథ బాలుణ్ణి
ఒడిలో పెట్టుకుని అతగాడు ఎర్రని కళ్ళతో
ఏమీ ఎరగని దేవుణ్ణి ప్రశ్నిస్తున్నాడు.

వెలుగును వెనక్కి నెట్టుతూ రేపటిరోజుకి
పదివేల సంవత్సరాలనాటి పాతముఖాన్ని అతికించేందుకు
ఒక హాహా హూహూవు ప్రయత్నిస్తోన్న ప్రాతఃకాలాన

కాలాన్ని సాగదీసి సాగరాన్ని మధించి ఖగోళాల నావర్తించి
అధునాతన భావుకులు స్వప్న భుక్కులు.

వర్తమాన శిరస్సున వధించబోయే సమయాన
గత భూతకాల ప్రసక్తిలేక గగన పాతాళాలమధ్య
ఏటవాలుగా జారే విలాసులు తత్క్షణ ప్రయోజన సాధకులు
చిరునవ్వులు చిందే విషమ సంధ్యవేళ
అతగాడు మూడవ పరిమాణంలోని ఊహాలకి
ఆకారం కల్పించలేక తికమక పడుతున్నాడు.

నెత్తుటిలో దోగుతూన్న చరిత్ర శిశువుకు
బొడ్డుకు బదులు పొట్టనుకోసిన అవివేకపు మంత్రసానులవలె
దేశాధినేతలు తెల్లబోయి నిల్చిన సమయాన
కోరికలకీ, సంతృప్తికీ మాటకీ ఆచరణకీ మనిషికీ మనసుకీ
మధ్య అగాధాలు నిలిచి ఆవులించే క్షణాన
అందాన్ని హత్యచేసి వికృత ఆనందాన్ని చంపి అశ్రువు
జీవితపు మైదానంమీద ఒడంబడిక చేసుకున్న రోజున
అతగాడు పరీక్షనాళికలో ఎండిన నాగరికత గుండెని పరీక్షించి
కొంచెం కొంచెం తన నెత్తురుతో తడుపుతున్నాడు.

చీలిన జీవితాల నెరదలలోంచి వచ్చే అస్పష్టపు ఆక్రందన ధ్వానాలు
భయంకర రహస్యాలపైన నల్లని విస్మృతీ వస్త్రం కప్పే వేళ
తూలిన తాగుబోతు కూలిన యింటి నడికుప్ప
బ్రతుకు రైలుదారిలో వాలిన మృత్యువు రెక్క
ఒకే ఒక్క కాన్వాసుమీద ఆర్టిస్టులు చిత్రిస్తోన్న నిమిషాన
కష్టాల బాధల భయాల పర్వత శిఖరాలపైన నిలచిన
కాంక్షా నీహారాల ఆశాసూర్యుడు ప్రతిఫలింప
ఏడు రంగుల ఇంద్రధనుస్సు లెక్కపెట్టి కోట్లకొలది జనులు
ఎండమావుల పండగలు చేసుకునే సమయాన
అతగాడు తెగిన ఫిడేల్ తీగల్నీ
కదలని గడియారపు గుండెల్నీ చినిగిన స్వప్నపు సంచుల్నీ
రిపెయిర్ చేసే ప్రయత్నంలో నిమగ్నుడయాడు.

స్టెన్‌గన్‌లు సోల్జర్లు జెట్ విమానాలు రాకెట్ల సమూహాలు
ఒక్కొక్క యుద్ధంలో మనుష్యుల్ని చంపి నాగరికతను రక్షించే

అద్భుత చారిత్రక ఘట్టాలలోన
ఆస్తికులు నాస్తికులు మతాలు సిద్ధాంతాలు
మనుష్యుల్ని మరచి పరమ సత్యాలను తరచి పైకితీసే
ఆవేశపు మధ్యాహ్నపు ఎండలలోన
నాలుగురోడ్ల కూడలిలో నిలబడి
సౌఖ్యనగరానికి దారి తెలియక
సైన్‌పోస్టు మీద మిథ్యాలిపి డిసైఫర్ చెయ్యలేక
జిగీషువుల జిజ్ఞాసువుల ముఖాలు వెలవెలబోతున్న సమయాన
అతగాడు ఒక్కడూ ఊపిరాడని గదిలో ఉరిపోసుకు చనిపోయాడు.

*–1960*

★ ★ ★

# రాజమండ్రి పాటలు

వరదకన్న ముందు భయం పెనువరదలాగ వచ్చింది
భయం మీద రాజమండ్రి తెప్పలాగ తేలుతోంది
అంచులు మోసిన గోదావరి ఆకాశం .కిందికి దిగినట్టు వుంది
ముచ్చటగా రైలు వంతెన ముత్యాల వడ్డాణంలా అమరింది
ఇంకొంచెం ప్రయాణం పొచ్చితే ఎక్కడుంది రాజమహేంద్రవరం
మానవుల గర్వం నగరాలసర్వం ప్రకృతిముందు శ్రీకృష్ణార్పణం
ఊరంతా ఆదుర్దా ఊదారంగులో తిరుగుతోంది
గుడిసెల్ని చూస్తే పాపం మేడల కేమిటో నామర్దా
కన్నీరుకీ పన్నీరుకీ మున్నీరుకీ నీరు సమానం
అయితే గోదావరి ఏ నీరు – ఏడ్పునీరు, చావనీరు!

## 2

అర్ధరాత్రివేళ
వానలో చలిగాలిలో
అంత పెద్ద నగరమూ వణికిపోతోంది
మధ్య మధ్య
మసక మసక విద్యుద్దీపాలు
వృద్ధ నగరమాత చత్వారపు నేత్రాలు
వానలో చలిగాలిలో
నిద్రలో నిశ్శబ్దంలో
క్షతగాత్ర అయిన హర్మ్యక్షం లాగ మూల్గుతోంది
మెరక వీధి యిసుక వీధి
ఈగలు వాలుతున్న పెద్ద పెద్ద వ్రణాలు,
వీరేశలింగం, దామెర్ల రామారావు
స్మృతులేవో కదిలిన యీ క్షణాలు
సింహం కళ్ళనుండి జారిన అశ్రుకణాలు

అర్ధరాత్రి వేళ వానలో చలిగాలిలో
రాజమండ్రి పాపాన్ని కప్పుకుని పడుకుంది.

## 3

రోడ్లు:
ఎగుడూ దిగుడూ
పెళ్ళాం మొగుడూ
వీరికి ప్రణయం
మనకే ప్రళయం

## 4

కొండలు
నల్లమందు తిన్న గున్న ఏనుగుల్లాగ కొండలు
ఎక్కడి వక్కడ మత్తుగా పడుకుంటాయి
సారంగధరుడి మెట్టదగ్గర మాత్రం
సంగీతం విషాదంగా వినిపిస్తోంది
నీతి కట్టె లాంటిది
కోర్కె మంటలాంటిది
అందుకే రాజరాజు కొంపకి నిప్పంటుకుంది.

## 5

రాత్రివేళ రాజమండ్రి వెళుతుంటే
రమ్య గౌతమీ జలాలలో
కొన్నివేల విద్యుద్దీపాలు ప్రతిఫలిస్తాయి
ఎవరీవిడధమ్మిల్లంలో యిన్ని కాంతి లతాంతాల్ని తురిమారు?
ఎవరీవిడగుండెల్లో యిన్ని కాంక్షాకీలల్ని వెలిగించారు?
అని విస్తుపోతాను
అయితే అప్పుడు గౌతమి ఎంత అందంగా వుంటుంది
నాట్యం చేసి అలసిన వేలుపు సానిలాగ!
అర్ధశయన మూర్తి అయిన రాణీలాగ!

## 6

గ్రీష్మంలో
రెల్లుపూల బార్డర్ వేసిన
నీలాల నీటి నైలాన్ చీర
వొంటి మీదనుంచి జారుతుండగా
రాజమండ్రి అనే యువతి
సందులూ గొందులూ ఎండలూ తిరిగి
విసుగెత్తి
వెనుక తానుండే గొప్పతనం మేడ ఎక్కడా కనిపించక
చిన్నబుచ్చుకుని
అలసిన కాళ్ళ నీడ్చుకుంటూ వెళ్ళి
దూరంగా
కొండల పక్కన నీడలలో కూర్చొని
కొబ్బరి నీళ్ళు తాగుతోంది.

## 7

రాజమండ్రిలో సాహిత్య సుందరి
అందెలూ బావిలీలూ ఇంకా మానలేదు
కొంచెం మడిగా చేసి పెడుతోంది
భోజనంలో పాతచింతకాయ పచ్చడీ, వంగ వరుగూ, పులుసూ
రుచిమాట దేవుడెరుగు గానీ
మాంచి ఆరోగ్యం తినగలిగిన మనిషికి!
యువకులూ నడివయస్కులూ కూడా
దేవతార్చనికి అక్కడికే వెళుతున్నారట
సెంట్లూ అత్తర్లూ
స్నోలు, పౌడర్లు
వాడదు, సినిమాలూ క్లబ్బులూ
చూడదావిడ;
వృద్ధపతి సార్వభౌముల
కృద్ధలోచనగోళ నిర్గత
శాసనాబద్ధయై, రుద్ధయై, ముగ్ధయై. –1960

★ ★ ★

# రాత్రివేళ

రాత్రివేళ ఎవరూ లేరింట్లో మసకగా వున్న విద్యుద్దీపాల కాంతిలో
ఒక్కణ్ణే బాల్కానీలో కూర్చున్నాను. బోగన్‌విల్లా పందిరిలో
ఒక్క నిముషం ఆగి తెరలు తెరల్లాగా వీచే గాలిలోంచి ఎవరిదో
ఏదో మధురాతి మధుర విషాదగానం నేరుగా వచ్చి గుండెల్లోకి
గుచ్చుకుంటోంది.

నిర్జన స్థలం, ఎవరూ లేరు, చుట్టూ పరచుకున్న మైదానపు
నగ్నదేహాన్ని స్పృశించబోయే నీచుల శాఖాగ్రపు వ్యగ్రపు
తొందర నిశ్శబ్దం మెల్లగా అడుగులు వేస్తూ నడుస్తోంది, ఆకాశం
మీద ఒక్క చుక్క మరో నక్షత్రంతో మాట్లాడే మాటమాత్రం
మనసుకి వినిపిస్తోంది.

ఇంత రాత్రివేళ ఈ గానం ఎవరిదో చీకటి కాగితం మీద ప్లాటినం
తీగలాగ మెరుస్తోంది, ఏదో విషాదాన్ని హాయిని భయాన్ని పంచి
పెడుతూంది, ప్రాణాలకి అడుగునవున్న సుతారపు తీగల్ని
కదలిస్తోంది, ఏదో విధి దష్టమైన జీవితం కాబోలు పాపం
మొరపెడుతోంది జాలిజాలిగా, సంకీర్ణమైన విశ్వరహస్యం మరీ
మరీ నిగూఢమై కదలే నల్లని నీడలలో కలసిపోతోంది.

చెరచబడ్డజవ్వని విడివడిన పృథుశిరోజ భారంలాగ ఈ
నిశీథం మలిన మలినమైన చెదరిన తన అందాన్ని చీకట్లతో
కప్పుకుంటోంది, ఒంటరిగా నాలో ఊహలలో అవ్యక్తంలాగ
ఒదుగుతోంది, అనంతమైన శూన్యాన్ని అలుముకుంటోంది
ఏదో పాట సూత్రం ఏడు పేడుపుగా సన్నగా తియ్యగా గాలిలో
ఊగుతోంది, నీరవమైన ఏకాదశి నిశీథాన్ని రెండుగా చీలుస్తోంది.

*–1961*

★ ★ ★

# వసుధైక గీతం

భూమధ్యరేఖ నా గుండెలోంచి పోతోంది
భ్రుకుటి లోపల నక్షత్రగోళం తిరుగుతోంది
ఈవేళ నన్నానవాలు పట్టలేవు నువ్వు
సూర్యుడిని చూడు నా తలమీద పువ్వు

అట్లాంటిక్ కల్లోల తరంగాల మేనువాల్చింది నేను
పసిఫిక్ లోతులలో రత్నాల్ని వెదకి తీసింది నేను
ఉత్తర ధ్రువాన ఒక పాదం దక్షిణ ధ్రువాన మరో పాదం
సర్వం సహా చక్రవర్తి పదవి సంపాదించుకున్నాను నేను.

సంకుచితమైన జాతి మతాల సరిహద్దుల్ని చెరిపివేస్తున్నాను చూడు
అకుంఠితమైన మానవీయ పతాకను ఎగురవేస్తున్నాను చూడు
చరిత్ర రక్త జలధికి స్నేహసేతువు నిర్మిస్తున్నాను రండి
కవి వచస్సవిత్రు కాంతిపూరమిది స్వేచ్ఛగా జలకమాడండి.

మధ్యధరా సముద్రతీర ఖర్జూర తరుచ్ఛాయ మధ్యాహ్నవేళ
నీ స్నిగ్ధ కపోల తల్పాన ముద్దిడిన ప్రియసఖుణ్ణి నేను
మౌంట్ వెసూవియస్ ఆగ్నేయ దర్పోజ్జ్వల జ్వాల
వెలిగించి దిగ్భిత్తికలు ప్రకంపింప పాడింది నేను.

అమెరికన్ పాల్‌రాబ్సన్ సంగీత గీతాన జాలిగా
ఆఫ్రికా అంధకారాటవుల సింహగర్జా నిర్ఘోషగా
కైలాస హిమగళము విడివచ్చు శాంతి సందేశమ్ముగా
పలికింది నేను, మానవాళికి అభయహస్త మిచ్చింది నేను.

ఎంత కన్నీరు మున్నీరుగా కురిశాను మీ కోసమై
ఎంత మిన్నేరు పన్నీరుగా దింపాను మీ కోసమై
వర్తమానం నేడు సుందరాభిసారిక వోలె నిలిచి హేలగా
ఆగామి కాల గంభీరస్వామి కంఠాన వేయబోయే మాలగా
నిలిచింది నేను, పిలిచింది నేను, దశదిశల కలిపింది నేను. –1962

★ ★ ★

# స్వేచ్ఛా విహారం

సరుగుడు చెట్ల నీడలలో
సరదాగా తిరుగుదాం
సగం మబ్బు సూర్యుడి మీద
శాటిన్ తెరలా కప్పకుంది
సంజ యెరుపు సెలయేటి మీద
చల్లిన తొలి సిగ్గులా వుంది
ఒక్కసారి యిల్లు విడిచి
ఉత్సాహంగా రా చెలీ!

జామెట్రీ కాలెక్యులస్
అక్కయ్యకి రెండో కానుపు
తమ్ముడికి మోకాలివాపు
చింతపండు ధర హెచ్చింది
చిన్నాన్నకు మతిభ్రమ కలిగింది
లేచిన మరుక్షణం ఎన్నో ప్రశ్నలు
గోరుచుట్టులా సలిపే లక్షల సమస్యలు

ఆనందాన్ని చంపేందుకు
అనంతంగా ఉంది లోకం
క్యూబా ఉంది కాంగో ఉంది
గోవా ఉంది జావా ఉంది
అడుగడుగునా యుద్ధభయం
మలుపు మలుపునా మృత్యుముఖం
ఆకలి నిరాశ రోగం
అసూయ ద్వేషం స్వార్థం

రోతపోని చాతకాని
ప్రభుత్వాలు ఉద్రేకాలు

కులాసాని చెడగొట్టేందుకు
అలాస్కా దాకా అవకాశం ఉంది.

కొంచెం సేపు స్వప్నంలోకి
గోర్వంకల రెక్కలతో
ఎగిరిపోదా మన్నీ మరచి
అబద్ధాన్ని ఆశ్రయించిన సుఖం
నిజాన్ని నిరూపించే నరకం
కన్న వెయ్యి రెట్లు నయం!

కల ఎప్పుడూ మనిషికి బలం
మిధ్యా జీవన రథ్యలలో
స్వప్నం ఒక సుందర తనుమధ్య

మనసూ మనసూ కలసిన మైమరపుంటే
మద్యం వృథా మాధుర్యం సదా
మనం కట్టుకున్న గాలిమేడల్ని
ఏ భూకంపం పడగొట్టలేదు
మనం విరియించుకున్న తోటలలో
ప్రతి పువ్వూ అనార్తవం నవం నవం.

నన్నూ నిన్నూ బలహీనులనీ
ఎస్కేపిస్టులనీ నిందిస్తుంది
ఊపిరాడక గిజగిజలాడే యీ లోకం

ఎవరెస్టుకన్నా – ఎత్తైన నా
ఊహా శిఖరాల్ని వీళ్ళెక్కలేరు
సింధూరం కన్న ఎరుపైన నా
హృదయాన్ని వీళ్ళు చదవలేరు
ఇల్లు విడిచి ఒళ్ళు మరచి
ఒక్కసారి రా చెలీ!

ఒకరినడుం ఒకరు చుట్టి
ఉల్లాసంగా తిరుగుదాం
సరుగుడు చెట్ల నీడలలో
విరుగుడు చేవ తోటలలో

మునిమాపు వేళ రెండు నక్షత్రాలు
ముద్దు పెట్టుకుంటూన్నప్పుడు
మునికాళ్ళమీద నిలిచి దేవతలు
మనని అసూయగా చూస్తున్నప్పుడు!

*–1962*

★ ★ ★

# దీపం

దీపాలు బాగుంటాయి
పాపల్లాంటి దీపాలు
కనుపాపల్లాంటి దీపాలు
పాపాలవంటి సహజ స్వచ్ఛ తీవ్రమైన దీపాలు.

చీకట్లో చీకటి కనపడదు
దీపం పాపంవంటి చీకటిని చూపెడుతుంది
దీపాల మధ్య చీకటి దివ్యంగా మెరిసిపోతుంది
దీపం ఆసరాతో చీకటి నైజాన్ని తెలుసుకో
పాపం ఆసరాతో మానవుడి నైజాన్ని తెలుసుకో

ఆకలేసినప్పుడు కొట్లో మిఠాయి కాజేద్దామనే యానాదిపిల్ల ఆబకళ్లు
ఆపుకోలేని యౌవనంలో తప్పటడుగువేసిన పెళ్ళికానిపిల్ల కన్నీళ్ళు
ఆరులక్షలున్నా దొంగనిలవలు వేసే షావుకారు అజ్ఞానపు కుళ్ళు
తోడేలు గొర్రెనుచంపి తాగుతూన్న నెత్తుటిలో సృష్టి క్రూరపు ముళ్ళు
ఆకతాయి మొగుడైనా ఆ వెధవ ప్రతిబింబాన్ని ఆప్యాయంగా మోసే
ఆడదాని ఒళ్ళు.

ఎన్ని కోరికలు ఎన్ని ప్రవృత్తులు
ఎన్ని విచిత్ర ప్రకృత్యార్భాట ఝంఝూమరుత్తులు
ఎన్ని చలత్ హేమంత వర్షానిదాఘ ఋతు శకుంత గరుత్తులు
ఈ అనంత ద్రవ్యంనుండే ఎంత వైశ్వానరశక్తి
శిలను చీల్చి సిరలు దాల్చి చిగురించిన ప్రాణయుక్తి
ఎంత సృష్టి లాలస
ఎన్నెన్ని ప్రాణాలు ఇవన్నీ దీపాలు

ప్రాణంలోంచి పాపం పాపంలోంచి ప్రాణం పుట్టాయి
పాపాన్ని చూసి పాపం అని జాలిపడడం పుణ్యం అని చెప్పాయి
సమాధిమీద దీపం చావుని వెలిగించి చూపుతుంది

దేవాలయంలోని దీపం దేవుని బందిఖానాను తెలుపుతుంది
ఇంటిముందు పెట్టిన దీపం ఇంటిలోపలి గుట్టును దాచుతుంది
ప్రతి రక్తకణంలో ఒక వాంఛాకీలిక
ప్రతి మనోంగణంలో ఒక సృష్టి దీపిక
ఏడమ్ అండ్ ఈవ్‌లు చేసిన పాపం యిలపై వెలిగించిన తొలిదీపం
ఈడేరని కోర్కెలమంటల పిలుపులు యెద యెదలో తెరచిన కత్తుల తలుపులు

ఇది ఆరని ఎర్రని దీపం
ఇది నిరంతర జీవనతాపం
తనను తాను కాల్చుకుంటూ భస్మమయే మోహన శాపం.

★ ★ ★

# ప్లస్ యింటూ మైనస్

కొసరు కొంచమైనా వెయ్యని
పిసినారి కోమటి దేవుడు
అసలు తూకంలోనే మోసం చేసి
ఆనందాన్నీ, ఆయుఃప్రమాణాన్నీ తగ్గిస్తాడు

అందమైన ఉదయాలూ, స్పందించే హృదయాలూ
చందనం, చంద్రకళా, సరదాలూ, స్వప్నాలూ
ఇన్నిటినీ సమకూర్చిన పసందైన గారడీ
చటుక్కున మడతపెట్టి-చేస్తాడు టెరిబుల్ ట్రాజెడీ

అయినా క్వయినా లాంటి జీవితంలోంచి
ఆనంద మధువును పిండాలని ఆలోచించి
కళలూ, కవిత్వాలూ, గాంధర్వం, వేదాంతం
కనిపెడుతూనే వున్నాడు మానవు డాజన్మాంతం

అర్ధరాత్రి చిలీలో, పట్టపగలు యిరాక్‌లో భూకంపం
ప్రియురాలి పరిష్వంగంలో సుఖం
పడుకునేముందు పాన్పుకింద పాముందో లేదో చూసుకో
ప్రబల శత్రువెవడో నిన్ను వెన్నంటి వున్నాడు కాసుకో

తాను లేనిదే దేవుడిని తలచేవాడెవడూ లేడంటాడు మానవుడు
తాను లేనిదే మనిషికి ఆలంబన ఏదంటాడు సదరు దేవుడు
ఈ రహస్యం రహస్యంగా వుంచకండి, అందరికీ చెప్పెయ్యండి
దేవుడిని తిరగేస్తే మానవుడు, మానవుణ్ణి తలక్రిందు చేస్తే దానవుడు

దేవుడికి మానవుడికి యెప్పుడూ సరిపడని దాంపత్యం
ఇద్దరికీ విడాకులు ఏ కోర్టూ యివ్వలేదు విచిత్రం
సుదీర్ఘ వలయంలాంటి కాలం చుట్టూ ఒకరినొకరు
అదేపనిగా తరుముకుంటూ తిరుగుతుంటారు
*గుండ్రంగా, గుండ్రంగా, గుండ్రంగా.* *–1962*

★ ★ ★

# మైనస్ యింటూ ప్లస్

జడంగా వున్న శాంతి నుండి
ఎడంగా తప్పుకుంటాడు మానవుడు
సంచలనం కలిగించే
సమరాంగణాన్నే కోరుకుంటాడు
అందుకే మానవ చరిత్ర అంతా యుద్ధమయం
యుద్ధాలులేని చరిత్ర చదివితే అర్థవిహీనం
స్వార్థం ఒక ప్రాథమిక శక్తి
క్రౌర్యం మీద అభిరక్తి
అజ్ఞాతంగా మనిషిలో, పశువులో సమానం
వైజ్ఞానికులు చెబుతారు దీనిలో నిజం
ఆశయాలూ ఆదర్శాలూ అంగవస్త్రాల లాంటివి
హఠాత్ పవన వీచికకి అవే తొలగిపోతవి
అసలైన మనిషి కాస్త అలజడిలో బయటపడతాడు
కసటు కనబడాలంటే పైన కొంచెం కదలించి చూడాలి
అక్కడక్కడ మహాత్ముని అడుగుజాడ కనపడినా
అటువైపు మళ్ళాక అడ్డదారినే గుడ్డిగా పడిపోతాడు
అవివేకానికున్న బలం ఆవేశాని కతికేనప్పుడు
ద్విపాదవాహనాలు బద్దెలుతప్పి ప్రమాదించక తప్పదు
అందుకే మానవుడు మానవుడిగా దేవుడిగా రూపొందే ఈ ప్రయాణం
అనంతదీర్ఘం పునఃపునర్వ్యర్థం బహుయుగ విస్తీర్ణం.

–1963

★ ★ ★

## ౨ *

ప్రపంచంలో ప్రాణికోటిలో
తానే ముఖ్యుడన్న నమ్మకం మానవుడికి
కానీ పాపం వాడికి తెలియదు
కప్పా బల్లీ మురికి కాల్వలో పురుగూ
ఎంత స్వాతిశయంతో ఉంటాయోమరి
ఒక రైలునీ ఒక విమానాన్నీ కనిపెట్టానని
ఉత్సాహంతో ఛాతీ విరుచుకుంటాడు మానవుడు
కానీ మానవజాతినే మారుమాటాడకుండా
మసి చెయ్యగలను మరో నిమిషంలోనని
కలరా బేసిలై – గర్వంగా లోపల్లోపల నవ్వుకుంటుంది
దేవుళ్ళని తన రూపంలో సృష్టించుకుని
తన భయాన్నీ కోర్కెల్నీ వాళ్ళకి తగిలించుకుని
అడిగినప్పుడల్లా వరాల్నిమ్మని ఒప్పందం చేసుకొని
ఫరవాలేదని ప్రమత్తుడయ్యాడు మానవుడు
ఏవో కొన్ని పరిశోధనలు చేసి భాష్యాలు వ్రాసి
ఇదంతా మిధ్య అనీ లేని నిజం ఎక్కడో దాక్కుందనీ
మిధ్యాసృష్టి భాగమైన మేధ ద్వారానే
అన్నీ తెలుసుకోగల ననుకుంటాడు మానవుడు.

★ ★ ★

---

* 'మైనస్ యింటూ ప్లస్' గీతిక మరో రూపంలో.

# న్యూ సిలబస్

అమెరికాలో డాలర్లు పండును
ఇండియాలో సంతానం పండును.

భూమి తనచుట్టూ తాను తిరిగుతూ
ధనవంతుడి చుట్టూ తిరుగుతోంది.

దరిద్రం సముద్రంలో వేదనల తెరచాపలెత్తి
ప్రయాణించే జీవన నౌకలకి మృత్యువే లైట్ హౌస్.

ఆశ ఉత్తర ధ్రువం, విధి దక్షిణ ధ్రువం
మనిషి రెండింటి మధ్య బంతిలా ఎగిరిపడే ప్రహసనం.

వాణిజ్యం ఆజ్యంకింద నాగరికతా క్రతుగుండంలో
అనురాగం, ఆత్మీయతా వేల్చబడే సమిధలు
స్వార్థం సోమయాజి, లక్ష్యం అధికార రంభా పరిష్వంగం

ఆడిస్ అబాబాలో హెయిలీ సెలాసీ గెడ్డం పొడుగు
చైనాలో చౌ - యన్ - లై అంటే పెద్ద అబద్ధం మడుగు.

ప్రజాస్వామ్య దేశాలలో ఖరకాంతలు వ్రీడావతులు
సామ్యవాద రాజ్యాలలో కౌశికులే మతగురువులు.

మజాకి పదవీ వ్యామోహం మద్యపానం వృథావృథా
గజానికొక గాంధారి కొడుకు గాంధీగారి దేశంలో

ఇజంలో యింప్రిజన్ అయితే యింగిత జ్ఞానం నశిస్తుంది
ప్రిజమ్‌లాంటిది జీవితం, వేర్వేరు కోణాలు ప్రదర్శిస్తుంది.

మాధుర్యం కావ్యంలో ఎందుకు! మత్క్రతిపతి స్తోత్రంలో వుంటే
చాలంటాడు తెలుగులో కవి

మాలిన్యం మనసులో వున్నా మల్లె పువ్వులా నవ్వగల్గడం
యీనాటి తెలివి

పల్లెటూరి పిల్లకి సినీతార దివా స్వప్నం
పట్నవాసం షోకిల్లాకి హాలీవుడ్ భూతల స్వర్గం.

చంద్రగోళం చవిటిపర్రమీద వెతగ్గా వెతగ్గా
ప్రబంధనాయికల ఉపాలంభనలు దొరికినవట
విశ్వనాథవారు వెనక్కి నడవగా నడవగా
వేదకాలం యింకా వెనక్కి వెనక్కి పోయిందట.

సౌత్ఆఫ్రికా ప్రధానమంత్రికి సామరస్యం ప్రధాన లక్ష్యం
రష్యానేత కృశ్చేవ్‌కి ప్రపంచ శాంతి ఒకటే గమ్యం
అమెరికన్ కెనడీకి పరోపకారం స్పూన్‌తో పెట్టిన ఆహారం
అయినా యుద్ధం ఎందుకంటే తమ్ముడూ! అది మన ప్రారబ్ధం!

ఇకముందు కీన్సే రిపోర్టు పాఠ్యగ్రంథం ప్రతీబడిలో
ఇకముందు స్ట్రిప్‌టీజ్ తప్పనిసరి ప్రతివూళ్ళో

విలాసవతుల క్రీగంటి చూపు నుండి విద్యుచ్ఛక్తి సరఫరా చేస్తారు
విశాఖపట్టణంలో ఆసుపత్రిని వేదాంత భవనంగా మార్చేస్తారు.

సుందరాంగుల జాగ్రఫీలో విద్యార్థులు నిమ్నోన్నతాలు గుర్తిస్తారు
సువర్ణం కన్న అగ్రవర్ణం లేదని సకల కులాలవారూ అంగీకరిస్తారు.

నిర్వేదం వేదంకింద, నిరాహారం నిష్ఠాగరిష్టతకింద
సశరీర సాయుజ్యం సామాన్యులకి ఉచితంగా కానుక
ఇది మిలియనీర్లూ, మతాధికారులూ వేసే సరికొత్త ఆధ్యాత్మిక ప్రణాళిక

హరనేత్రానల దగ్ధుడైనా అనంగుడి పొగరు కాస్తయినా అణగలేదని
సర్వోదయ స్వాములందరూ స్మర (సర్ప) మహాయాగంలో
సినిమా పోస్టర్లూ, తారల పాతచీరలూ సమిధలుగా ఆహుతి

ఘనాఘునంలా గర్జించింది ఆఫ్రికన్ ఘనా
పంచశీలతో ఊడిపోయిన సీల పేరు చైనా

అణుబాంబు యుగంలో భూతలమొక స్వర్గం మనుష్యులు వినా
మను సంభవం ఇంక మార్చేసి రాయాలి అల్లసాని పెద్దన్న అయినా

భూమధ్యరేఖ దగ్గరకన్నా ఆడదాని భ్రూమధ్యరేఖ దగ్గర వేడి ఎక్కువ
ఎన్నికలలో ఎగరేసిన వాగ్దానపు కత్తులకి
మొనకన్నా పిడి దగ్గర వాడి ఎక్కువ

చచ్చి బ్రతికిన ప్రతివాడూ ప్రాక్టీస్ లుముంబా
బతికినా చచ్చినవాళ్ళు ఒక లెక్కా జమా!

మతం నల్లమందు గతం ముదిమికి విందు
భావి యౌవనులకు భావకులకు బలే పసందు

ఆలోచనల జెట్ విమానాలకి భయపడి
అలవాటు మట్టిరోడ్ల మీద కుంటుతుంది ముసలితనం
పృథ్వ్యాకాశాల మధ్య గాండీవ ధనుష్టంకారంలాగ
మోగుతుంది యౌవనం

నా పాట విప్లవానికీ విశ్వశాంతికీ నాంది అన్నాడొక అధునాతన
సాహసికుడు

నా మాట చీకటికీ, శ్లేష కవిత్వానికీ, శ్లేష్మ జీవితానికీ బాట
అన్నాడొక ప్లవంగుడు

ఆగామి ఆశల వర్షాగగనం మీద అదిగో ఆనందం అనే
ఇంద్రధనుస్సు అలమటించే లోకానికి అండగా నిలుస్తుంది నవకవి వచస్సుధా
సుమనస్సు

*–1962*

★ ★ ★

# అమృతం కురిసిన రాత్రి

అమృతం కురిసిన రాత్రి
అందరూ నిద్రపోతున్నారు
నేను మాత్రం
తలుపు తెరచి ఇల్లు విడిచి
ఎక్కడికో దూరంగా
కొండదాటి కోనదాటి
వెన్నెల మైదానంలోకి
వెళ్ళి నిలుచున్నాను.

ఆకాశం మీద అప్సరసలు
ఒయ్యారంగా పరుగులెత్తుతున్నారు
వారి పాదాల తారామంజీరాలు
ఘల్లు ఘల్లని మ్రోగుతున్నాయి
వారి ధమ్మిల్లాల పారిజాతాలు
గుత్తులు గుత్తులై వేలాడుతున్నాయి
వారు పృథు వక్షోజ నితంబ భారలై
యౌవన ధనుస్సుల్లా వంగిపోతున్నారు.

నన్ను చూసిచూసి కిలకిల నవ్వి ఇలా అన్నారు
చూడు వీడు
అందమైన వాడు
ఆనందం మనిషైనవాడు
కలల పట్టు కుచ్చులాగుతూన్న కిరీటం ధరించాడు
కళ్ళ చివర కాంతి సంగీత గీతాన్ని రచిస్తున్నాడు
ఎర్రని పెదవులమీద తెల్లని నవ్వుల వీణల్ని మీటుతున్నాడు
ఎవరికీ దొరకని రహస్యాల్ని వశపరచుకున్నాడు
జీవితాన్ని ప్రేమించినవాడు జీవించడం తెలిసినవాడు

నవనవాలైన ఊహావర్ణార్ణవాల మీద ఉదయించిన సూర్యుడు
ఇతడే సుమీ మన ప్రియుడు, నరుడు, మనకి వరుడు

జలజలమని కురిసింది వాన
జాల్వారింది అమృతంపు సోన
దోసిళ్ళతో తాగి తిరిగి వచ్చాను
దుఃఖాన్నీ చావునీ వెళ్ళిపొమ్మన్నాను
కాంక్షా మధుర కాశ్మీరాంబరం కప్పుకున్నాను
జీవితాన్ని హసన్మందార మాలగా భరించాను
జైత్రయాత్ర పథంలో తొలి అడుగు పెట్టాను.

అమృతం కురిసిన రాత్రి
అందరూ నిద్రపోతున్నారు
అలసి నిత్యజీవితంలో సొలసి సుషుప్తి చెందారు
అలవాటునీ అస్వతంత్రతనీ కావలించుకున్నారు
అధైర్యంలో తమలో తాము ముడుచుకుపోయి పడుకున్నారు
అనంత చైతన్యోత్సవాహ్వానాన్ని వినిపించుకోలేక పోయారు

అందుకే పాపం
ఈనాటికీ ఎవరికీ తెలియదు
నేను అమరుడనని!

*–1962*

★ ★ ★

# లయగీతం

(నిరంతరమూ యుద్ధానికి సన్నద్ధమౌతున్న ప్రభుత్వాల మనస్థితీ, మెగాటన్ బాంబులు కల్పింపబోయే భయంకర పరిణామాన్నీ ఊహించి)

అంతరిక్ష
మవలిపక్క
హాహాధ్వర్గ నినదించెను
అతలమందు వినిపించెను.

ఇరుసు వంగి
భూమి కుంగె
జరత్కారు పూర్వీకుల శాఖలపై వ్రేలాడుచు
శరణు శరణు వచనమ్ముల
సాశ్రు నయన దీనులైరి

అంతరాళ
మంత నిండి
ఊదారంగుల మంటలు
ఉవ్వెత్తుగ సుడి తిరిగెను
దిగ్గజాలు
ఘీంకరించెను

రణ కాష్టము లన్ని దెసల కణకణమని రాజుకొనెను
రాలుచున్న పిడుగువాన రాబందులు గొణిగికొనెను
చీకటిలో
వాకిటిలో
ఉన్మాదుల సంభాషణ
ఉలూకముల అన్వేషణ
ఎవరువారు
గుండెలదరు

బయలులోన మొయిలులోన
బరువు బరువు అడుగులతో
పరుగులెత్తు యమదూతల
పదధ్వనుల ప్రతిధ్వనులు
హిరోషిమా
నాగసాకి
నగరస్మృతి చితాభస్మ
మెగిరిపడెను నా కన్నుల
జ్వలత్కాష్ఠ
మిలాతలం
శప్తధాత్రి, నిర్జనమై శ్మశానమై పరచుకొనెను
సుప్త దేవదేవ హృదయ స్పృజ్నాశము లెగిరిపడెను.

నిలుము నిలుము
నిముషమాత్ర
మఖిల ప్రజా మరణగాథ
నావిష్కరణము చేయకు
కలసిరాదు
కాలమింక
అంకపాళి కోట్ల శిశువు లాఖరి కనుమూతలోన
దద్దరిల్లు మాతృహృదయ దారుణరోదన వినువిను
రాత్రికాదు
పగలుకాదు
చరమకాల విషమసంధ్య
చషకములో నర రుధిరము
సందిటలో
శివశిరస్సు
సకల దిశా జరరవాంత శబలిత గంధక ధూమము
జరరనిశా శిరోజాంతముల లయకీలావలయము
ఇది విలయము
ఇది నిరయము
అహస్కరుడు మరణించెను
విధుబింబము వ్రక్కలయెను

ఉల్కా లెగిరి
ఒరసి మండె

విష జలధర గగనమ్ముల వేల్లిత పిశాచ గణములు
విష జలచర సముద్రముల విరిగిన శేషుని ఫణములు

ఇదే యిదే
ఇదే యిదే

మానవునికి చివరిరోజు
చరిత్ర ఇక లేదు లేదు

మనిషి మేధ మనిషి గుండె విడిపోయిన ఆనవాలు
భస్మీకృత ధాత్రిమీద కశ్చిన్మార్జుని తుదివ్రాలు

విధి హసించు
ఇది ముగింపు

*-1963*

★ ★ ★

# ఒక్కసారి

ఒక్కసారి
ఒక్కసారి
ఉద్విగ్న హృదంతరం
ఉన్మత్త ప్రభంజనం
రేగనీకు
సాగనీకు

అడవులలో పెద్దపులులు అర్ధరాత్రి పరుగులెత్తు
నడవలలో పెన్నుత్రాచులు నాల్కసాచి బుసలుకొట్టు

ఒక్కసారి
ఆశజారి
నిస్పృహలో నీరసించి
నెగడువంటి వేదనలో
తూలిపోకు
కాలిపోకు

దిక్కులలో కార్మొయిళ్ళు దిగులువోలె కమ్ముకొనుచు
చుక్కలలో తళుకుమాసి ఒక్కటొకటి రాలిపడును

ఒక్కసారి
మనసుమారి
కలలబాట విడిచిపెట్టి
వలపు చెలియ తొలగనెట్టి
నడిరాతిరి
పడిపోవకు
చలి తుపాను వీచి వీచి అలరుతోట వాడిపోవు
పొలిమేరల మంటలేచి పూరిగుడెసె కాలిపోవు

ఒక్కసారి
దిక్కుమారి
కడలిపొంగు కనులతోడ
గడప గడప ముందు నిలిచి
విలపింపకు
వేడుకొనకు
భూకంపము వచ్చి మహా నగరమ్ములు ధరక్రుంగును
భూధరములు రగిలి పగిలి భుగ భుగ లావా పొంగును

ఒక్కసారి
ఓ నెచ్చెలి
విశ్వాస పునర్నవం
వాసంత కలస్వనం
చిక్కబట్టి
చేర రమ్ము
ద్యుమణి కిరణకాంతి కురిసి ధ్రువసీమల మంచు కరుగు
తొలిరేవున లంగరెత్తి తెలివెల్గుల ఓడ కదలు

*-1963*

★ ★ ★

# విరహోత్కంఠిత

నా గది స్వప్నాలతో నిండిపోయింది
నా మది స్వగతాలతో కుంగిపోతోంది
ఇంక రావెందుకు ప్రభూ
శంకాకులమై ఈ రాత్రి సడలిపోతోంది.

ఎన్ని సరదాల అగరువత్తులు వెలిగించుకున్నాను
ఎంత కాంక్షా శ్రీగంధమ్ము మైనలదికొన్నాను
సవ్వడైతే చాలు ప్రభూ
రివ్వున స్మరశరం హృదయాన్ని దూసుకుపోతోంది.

నా వొంటి నిగనిగలవంటి శయ్యను సజ్జితం చేశాను
నా కంటి మిలమిలలవంటి మధువు పాత్రల నింపాను
త్వరమాణమై ప్రభూ, నా
తనువు స్వీయ యౌవన భారాన తరబడి పోతూన్నది.

కిటికీ అవతల హిమస్నాత మాలతీలత నన్ను పలకరింపదు
కిటుకు తెలిసిన పొదలోని గువ్వజంట నన్నూరడింపదు
కందళించే యీ వలపు ప్రభూ
గాఢాశ్లేష దోహదం లేక క్రమవికాసితోద్భాసితం కానేకాదు.

అవధరించవెందుకు పరిపక్వమైన నా యౌవన విన్నపాన్ని
నవధరించవెందుకు అసకృదతిశయోక్తికి శీలమైన నా తనూకావ్యాన్ని
జాగు సేయకు ప్రభూ – కడ
జాముVచ్చెనా తన వెలుగు పారెనా – నిష్ఫలమివన్నీ

సేవంతికా సురభిళ శ్రీమంత మీ నిశాంతమ్ము నన్ను వేగించును
హేమంత సమీర పోత మేమింతగా క్రొవ్వి నన్నలయించును
ఎందుకింత నిర్దయ ప్రభూ
ఏకాంత కుంత నిహతమ్ము రసైకమద్భావనా శకుంతమ్ము –*1963*

★ ★ ★

# అమ్మా, నాన్న ఎక్కడికి వెళ్ళాడు?

అమ్మా, నాన్న ఎక్కడికి వెళ్ళాడు? ఇంకా రాడేం?
అని అడిగాడు నాలుగేళ్ళ పిల్లవాడు మరోసారి—
అలవోకగా వాడి తలనిమురుతూ ఆమె అలాగే
ఆశతో వింటోంది రేడియోలో వార్తలు —
ఆమె కళ్ళల్లో విమానాల రెక్కలు కదలిన నీడలు
ఆమె గుండెల్లో మరఫిరంగులు పేలిన జాడలు
కాశ్మీరు సరిహద్దులో కమ్ముకొన్న నల్లని పొగలమధ్య
కాలూని నిల్చున్న సైనికుడు చటుక్కున
ఆమె కళ్ళముందు నిలిచాడు.

ఆమె కళవళపడింది – నిట్టూర్చింది – పయట సరిచేసుకుంది
అంతలో మృదుగర్వరేఖ ఆమె పెదాల చిరునవ్వుతో కలిసిపోయింది
పార్కు బెంచీమీదనుండి లేచి పిల్లవాడికి చేయూతనిచ్చి
మెల్లగా నడుస్తూ మునిమాపు చీకట్లలో కలిసిపోయింది.

ఆమె రోజూ వస్తుంది పార్కులోకి వార్తలకోసం
అలాగే తెల్లని చీరకట్టుకుని ఎర్రని బొట్టు పెట్టుకుని
నల్లని వాల్జడలో తెల్లని సన్నజాజులు తురుముకొని
అదే పార్కు అదే రోడ్డు అదే బజారు అదే యిల్లు
అయినా ఆమె ఏదో మార్పుని పసికట్టింది
అందరూ తింటున్నారు తిరుగుతున్నారు
అయినా ఎక్కడో డెక్కపట్టింది.

బిగపట్టిన నగరాల నరాలమీద ఏవో వార్తల గుసగుసలు
బిగించిన పిడికిళ్ళ సందులనుండి జారిన నెత్తుటి ప్రతిజ్ఞలు
ఒకే వూపు ఒకే తూగు ఒకే దీక్ష – జాలి మేల్కొన్న గుర్తులు.

ఒక దేశం తన దారిన తాను పోతూవుంటే
ఊరుకోదు ఇరవయ్యో శతాబ్దపు నాగరికత

పొరుగువాడి మంచితనం దుష్టుడి దురహంకారాన్ని రెచ్చగొడుతుంది
పక్కవాడి సౌభాగ్యం బాలిశుడి గుండెల్లో మంటల్ని రేపుతుంది
ఆసియారంగం మీద నియంతలవతరించిన దుర్ముహూర్తాలివి
చరిత్రకు సిగ్గుచేటు

ప్రజల నోళ్లుకొట్టి ప్రజాస్వామ్యాన్ని పాతిపెట్టి
గజదొంగ లీనాడు రాజులై రారాజులై ఏలుతున్నారు
అందుకే భారతం పొడ వారికి కిట్టదు, రాజకీయ ద్యూతంలో
లాభం ముట్టదు

మెత్తగావుంటే పిల్లి అన్నారు
తిరగబడి మొత్తితే బెబ్బులి అన్నారు
అవకాశవాదులు నోరుతెరిస్తే దుర్వాసన
నీతిని విడిచిపెడితే రాజనీతి అవుతుంది
జాతికి మతావేశం పొదిగితే కోతి అవుతుంది
పాకిస్తాన్ చైనాల పరస్పర మైత్రి
పాముూ తొడేలూ కలిసినట్టు
ఇది రెండు దేశాలమధ్య యుద్ధమే కాదు
ఇది కాస్త భూమికై కయ్యమే కాదు
ప్రపంచ భవితవ్యానికి ప్రధానమైన విలువల్ని కాపాడే ప్రయత్నం యిది
భావనా స్వాతంత్ర్యం వ్యక్తి గౌరవం
వర్ణ వర్గ మతభేద రాహిత్యం దీనికి పునాది

ప్రతి భారతీయుడూ ఒక సోల్జర్ ప్రతి హృదయం ఒక శతఘ్ని
రేడియోలో వార్తలు రోజూ వస్తున్నాయి
విజయ పరంపరను అందిస్తున్నాయి.

శత్రువుల టాంకులు విమానాలు ఎన్నో ఎన్నో కూలిపోయాయి
సాహసోపేతమైన భారతీయ సైన్యతరంగం
లాహోర్ సరిహద్దుల మీద విరుచుకు పడింది.

నిర్నిద్రహర్యక్షమై జాతి నిలబడి గర్జించింది
కీలర్, అబ్దుల్ హమీద్, హవల్దార్ పోతరాజు
ఇంకా లక్షలాది అజ్ఞాత సైనికుల కాబాలగోపాలం
కృతజ్ఞతాంజలి సమర్పించింది.

ఆమె ఆరోజు కూడా కొడుకుతో పార్కుకి వచ్చింది
అలాగే తెల్లచీర కట్టుకుందిగాని ఎర్రని బొట్టులేదు
నల్లని వాల్జడలో తెల్లని సన్నజాజులు లేవు, చేతులకు గాజులు లేవు
ఆమె సోగకన్నులలో వానకురిసి వెలిసిన ఆకాశం స్ఫురించింది
ఆమె చీటికీ మాటికీ అదిరే పెదవిని ముని పంటితో నొక్కుతోంది
అక్కడ చేరిన గుంపులు 'జైహింద్' అన్న నినాదం చేశారు.

"అమ్మా, నాన్న ఎక్కడికి వెళ్ళాడు - ఇంకా రాడేం?"
అని అడుగుతూన్న కుమారుణ్ణి అక్కున చేర్చుకుని
ఆమె కూడ రుద్ధకంఠంతో 'జైహింద్' అని మెల్లగా పలికింది
ఆ మాట స్వర్గంలో ఒక వీరునికి హాయిగా తీయగా వినపడింది.

*–1965*

★ ★ ★

# ప్రార్థన

దేవుడా
రక్షించు నా దేశాన్ని
పవిత్రులనుండి పతివ్రతలనుండి
పెద్దమనుషులనుండి పెద్దపులులనుండి
నీతుల రెండు నాల్కలు సాచి బుసలుకొట్టే
నిర్హేతుక కృపా సర్పాలనుండి
లక్షలాది దేవుళ్ళ నుండి వారి పూజారులనుండి
వారి వారి ప్రతినిధులనుండి
సిద్ధాంత కేసరులనుండి సిద్ధులనుండి
శ్రీ మన్మద్గురు పరంపరనుండి

దేవుడా
నలభైకోట్ల మనుష్యుల నిజమైన ప్రాణంవున్న
మనుష్యులతో నిండిన దేశం నాది
ఆకలీ బాధలూ ఆందోళనలూ సమస్యలూ
విరివిగావున్న విచిత్రసౌధం మాది
కడుపు నిండుగా ఆహారం గుండె నిండుగా ఆశ్లేషం
బ్రతుకు పొడుగునా స్వతంత్రం
కొంచెం పుణ్యం కించిత్ పాపం
కాస్త కన్నీరూ మరికాస్త సంతోషపు తేనీరూ
చాలు మాకు తండ్రీ

సరదాగా నిజాయితీగా జాలీ జాలీగా
హాయి హాయిగా బ్రతుకుతాం
మాకు నటనలు వద్దు మా చుట్టూ కటకటాలు వద్దు
గొప్పలూ గోసాయి చిట్కాలూ వద్దు.

దేవుడా!
కత్తి వాదరకు తెగిన కంఠంలో హఠాత్తుగా
ఆగిపోయిన సంగీతాన్ని వినిపించు

మానవ చరిత్ర పుటలలో నెత్తురొలికి
మాసిపోయిన అక్షరాల్ని వివరించు

రహస్య సృష్టి సానువులనుండి జారిపడే
కాంతి జలపాతాన్ని చూపించు

మమ్మల్ని కనికరించు

చావు పుట్టుకలమధ్య సందేహం లాంటి
జీవితంలో నలువైపులా అంధకారం

మంచి గంధం లాగ పరిమళించే మానవత్వం
మాకున్న ఒకే ఒక అలంకారం

మజిలీ మజిలీకి అలసిపోతున్నాం
మలుపు మలుపుకీ రాలిపోతున్నాం

ఆశల వెచ్చని పాన్పుమీద స్వప్నాల పుష్పాలు జల్లుకుని
ఆదమరచి కాసేపు విశ్రమించటాని కనుమతించు తండ్రీ!

–1963

★ ★ ★

# యుద్ధంలో రేవుపట్టణం

సముద్రంలో చీకటిలో ఓడలు
నగరంలో చీకటిలో నీడలు
రాత్రి గుండెమీద లేచిన మంటలు
సముద్రంలో ఎర్రని మంటల మాటలు
ఓడల్లో మేల్కొన్న మనుష్యులు
మనుష్యుల ముఖాలమీద ఏసిడ్ మచ్చలు
తీరానికీ తీరానికీ మధ్య హడ్ వైర్లెస్ వార్తలు
మనుష్యుల జేబుల్లో భయాల బొద్దింకల పరుగులు
యెల్లో గ్రీన్ గ్రీన్ రెడ్ డేంజర్
సైరన్ కూతలు
ఫిరంగి మోతలు
ట్రెంచెస్‌లో నొక్కిపట్టిన ఉలిపిరి ఊపిరి
చీకటిలో వ్యాపించిన మృత్యువు కావిరి
నగరం టవరుమీద ఎక్కి ఎర్రగా చూస్తోంది
నగరం భయంతో గుండె బరువెక్కి నల్లగా చస్తోంది
లైట్‌హౌస్ రాక్షసి తలచుట్టూ ఒకే కన్ను తిరుగుతోంది
నగరంలో నరాలమీద తుపాకీల వరసలు
గగనంలో విమానాల విరిసిన తెల్లని రెక్కలు
రెక్కల మధ్య ఆకాశం ఎర్రని ఎరుపు
చుక్కలమధ్య ఆకాశం చితికిన కురుపు
నగరంలో గదిలో పొలిటీషియన్ను మనస్సులలో పిచ్చిగీతలు
సముద్రం ఎదలోంచి ఏవేవో కూతలు
ఆకాశంమీద పేలిన కాలిన విమానాలు
సముద్రంలో అంటుకున్న మునుగుతున్న ఓడలు
అంటుకున్న ఓడలోంచి అరుపులు
ఇళ్లల్లో సన్నని ఏడ్పులు

గ్రీన్ గ్రీన్ యెల్లో యెల్లో సైరన్ మోగిన అభయం
నగరంలో చీకట్లో ఒక్కసారిగా నల్లని చల్లని నిశ్శబ్దం
చటుక్కున నగరం చేతులెత్తి గుండెలు బాదుకుంది
సముద్రంలో మొసళ్లు కంగారుపడి శవాల్ని మింగేశాయి.

–1964

★ ★ ★

# నీడలు

చిన్నమ్మా
వీళ్ళమీద కోపగించకు
వీళ్ళ నసహ్యించుకోకు

నిన్నెన్నెన్నో అన్నారు అవమానాల పాల్జేశారు
అవినీతి అంటగట్టారు
ఆడదానికి సాహసం పనికిరాదన్నారు.

చిన్నమ్మా
వీళ్ళందరూ భయపడిపోయిన మనుష్యులు
రేపటిని గురించి భయం సంఘ భయం
అజ్ఞాతంగా తమలో దాగిన తమనుచూసి భయం
గతంలో కూరుకుపోయిన మనుష్యులు
గతించిన కాలపు నీడలు

చిన్నమ్మా
వీళ్ళందరూ తోకలు తెగిన ఎలకలు
కలుగుల్లోంచి బయటికి రాలేరు
లోపల్లోపలే తిరుగుతారు
మౌఢ్యంవల్ల బలాఢ్యులు
అవివేకంవల్ల అవినాశులు
వీళ్ళందరూ మధ్యతరగతి ప్రజలు
సంఘపు కట్టుబాట్లకి రక్షకభటులు
శ్రీమంతుల స్వేచ్ఛావర్తనకి నైతిక భాష్యకారులు
శిథిలాలయాలకు పూజారులు

చిన్నమ్మా
వీళ్ళందరూ సగం సగం మనుష్యులు

మరోసగం మరుగునపడిన భయస్తులు బాధాగ్రస్తులు
భారతం భాగవతం చదువుతారు
పాపం పుణ్యం కేటాయిస్తారు
డైలీ పేపరు తిరగేస్తారు
జాలీగా ఉన్నట్లు నటిస్తారు
చప్పబడిన నిన్నటి మాటల్నే మాట్లాడుతుంటారు
కప్పబడిన నిన్నటి కలల్నే తలుచుకుంటారు
సన్నంగా పళ్ళ సందున నవ్వుకుంటారు
హఠాత్తుగా జడుసుకుంటారు
నిటారుగా నిలబడలేరు
వీళ్ళందరూ ముక్కలైన గాజు పెంకులు
చెల్లాచెదురైన మూగ ముత్యాలు
కల్లాకపటం తెలియని కబోది గుంపులు
తమని తామే మోసగించుకునే విద్యాధికులు విదూషకులు
తమ చెట్టుకొమ్మని తామే నరుక్కునే అమాయకులు
సంప్రదాయకులు

చిన్నమ్మా
వీళ్ళను విడిచి వెళ్ళిపోకు
వీళ్ళందరూ నీ బిడ్డలు
ఆకలి అవసరం తీరని కష్టాల గడ్డలు
వాచకాలలో నీతుల్ని వల్లిస్తూ
దరిద్రంలో హరిద్రాశోభల్ని గుర్తిస్తూ
ఓపికలేని భార్యలకు సహనాన్ని బోధిస్తూ
ధైర్యంలేని తమ స్వభావాన్ని ధర్మమని పిలుస్తూ
బరువుగా బెదురుగా బతుకుతున్న వీళ్ళమధ్య
డైనమైట్ పేలాలి
డైనమోలు తిరగాలి
కాళరాత్రివేళ కంకాళాలు చెప్పిన రహస్యం తెలియాలి
దారిపక్క నిల్చిన మోడుచెట్ల బాధని అనువదించాలి
పచ్చికలో దాక్కున్న పాముల్ని బుట్టలోకి పట్టాలి
రేపటి ఉదయానికి ఈ వేళ వెలుగుల్ని సమకూర్చుకోవాలి.

చిన్నమ్మా
నేను వెళ్ళొస్తాను

చీకటి పడుతోంది
చిటారుకొమ్మలో నక్షత్రం చిక్కుకుంది
శిథిల సంధ్యాగగనం రుధిరాన్ని కక్కుతుంది
దారంతా గోతులు యిల్లేమో దూరం
చేతిలో దీపంలేదు, ధైర్యమే ఒక కవచం.

*–1964*

★ ★ ★

# చావులేనిపాట

అన్నా
శతధా విభిన్నమైన ఈ గుండెలో
సంగీతం యింకా వినపడుతోంది
చావనని నమ్మకం కలిగింది
చావులేదు నా కని ఎలుగెత్తి చాటాలనిపించింది

అన్నా
ఒక్క సమ్మెట పోటుకే
ఉరలిన రక్తాన్ని తుడుచుకొనే లోపలనే
చక్కని సన్నజాజి పందిరికింద స్వాప్నిక సురవధూటి
నిలబడుతుంది
నవ్వుతూ పిలుస్తుంది
వదనాన జారే స్వేదాంబుకణాన్ని
వలాహక చేలాంచలంతో తుడుస్తుంది.

అన్నా
నేను నిర్మించుకున్న ఆశాచంద్రశాలలో
కాలం కరిగి వెన్నెలయింది
నా భావం వీణా నిక్వాణమయింది
నా గీతం రటన్నటన్నూపుర నినాదమైంది,
నేను యౌవనాన్ని ఆనంద జీవన వనాన్ని
ఒక్క నిశాంత నీహార కణం సోకినా
ఒక్క కౌముదీ శీతల కిరణరేఖ జాల్వారినా
ఒక్క దయామయి అడుగు సవ్వడి పలుకరించినా
కోటి పువ్వుల్ని పూస్తాను
కోటి నవ్వుల్ని జల్లుతాను

అన్నా
దూరతీరాన తెల్లని ఓడ తెరచాప కదలినపుడు
భావ హృదయాన నిశ్వసనానిలం వీచినపుడు
ఒక్క దుఃఖితుడు నవ్వినపుడు
ఒక్క పతితుడు కన్విప్పినపుడు
అక్కడ నా అడుగుజాడ గుర్తించగలవు
అక్కడ నా సందేశాన్ని అశ్రుసంగీతాన్ని ఆహ్లాదించగలవు.

–1964

★ ★ ★

# కౌనకళ్ళకు అక్షరాంజలి

మీతో పరిచయం స్వల్పం, మైత్రికి హృదయం ముఖ్యం
అందుకే మిమ్మల్ని బాగా ఎరుగుదునన్నది ఒక సత్యం
అక్షర లోకంలో మీరు వారగా నిలబడి పువ్వుల్ని పూస్తున్నప్పుడు
ఆ పక్కనుంచి వెళుతూ ఆఘ్రాణించి హాయి పొందిన వారిలో నేనొకణ్ణి
కృత్రిమమైన మనసులూ మాటలూ కీచాటుగా నిండిపోయిన లోకంలో
నిజాయితీగా నిండుగా పలికే గొంతు నిజంగా ఎంతో అవసరం
సిన్సియారిటీ కవితా సుందరికి సీమంతం లాటిది
శివ సుందరాలకి సత్యం బేసలాంటిది
ప్రగాఢమైన అనుభవమూ ప్రకీర్ణమైన జలధరమూ మాత్రం
పరిశుభ్ర రసధారల్ని వర్షించగలవు
హృదయం ఉన్నవాడవు, అదునూ పదునూ ఎరిగినవాడవు
కథతో కవితతో తెలుగుదనం, వెలుగుదనం కలిపి పంచిన వాడవు
కథంను లిఖామి మమ హృదయ ప్రమోదం,
సుఖితమా స్స్వతతః శరదాం శతమ్.

–*1971*

* * *

# పోయిన వజ్రం

ఉగాదికి నీకు ఏం వ్రాయను?
సగానికి సగం తియ్యని అబద్ధాలు
సరదాగా చెప్పనా
పరదాలో దాక్కున్న నిజాల్ని
బయటికి తీసి విప్పనా

అతృప్తాలైన కళ్ళు
ఆతృతతో అలసిన వొళ్ళు
అబద్ధంలో చుట్టబెట్టిన రాళ్ళు
ఏ భూమ్మీద కట్టుకోమంటావు
పొడి ఇసుకతో ఇళ్ళు
ఏ ఆకాశం మీద జల్లమంటావు
అడియాసలు పువ్వొళ్ళు
ప్రతియేడూ సముద్రం వొడ్డున
పీతలు పండుగ చేసుకుంటాయి
ప్రతిగుండెలో ఏడుపుగట్ల వార
పాటలు వినిపిస్తూ వుంటాయి

నక్షత్రాల్ని కోసి సిగలో
తురుముకుందా మనుకున్న నా భార్య
నక్షత్రాలైనా ఎరక్క రాత్రిళ్ళు
మేల్కొన్న నిట్టూర్పుల గాథలు
ఔనౌను పోగొట్టుకున్న వజ్రం కోసం
ఎక్కడని వెదుకుతావు
ఏ నేల పగుళ్ళలో ఏ గుండె లోయలలో
ఏ కారడవులలో ఎందుకో బెంగ నీలో నాలో
దేనికోసమో తెలీని అన్వేషణ
అదృశ్య జీవితశాఖలపైన పువ్వు లవలేని మొగ్గల సంభాషణ

అయినా నడుస్తున్నాను
దట్టమయిన మంచుపడిన చీకట్లో అలాగే వెతుక్కుంటున్నాను
నన్ను నేను నాలో నీలో గతంలో
మనని మనం పోగొట్టుకున్న దినం మహాలయ అమావాస్య
ప్రతి ఉగాదికీ మెరుస్తూ పిలుస్తుంది ఆశావేశ్య

*–1964*

★ ★ ★

# నెహ్రూ

ఈ వేళ పువ్వులన్నీ వాడిపోయిన రోజు
ఏకాంతంలో భూమి ధ్రువగళాలెత్తి ఏడ్చిన రోజు
తెల్లని పావురం ఎండలో సొమ్మసిలిపోయింది
తల్లి లేని పిల్లల్ని నీడలోకి పిలిచేవాళ్ళు లేరు.

సముద్రమధ్యంలో ఓడలో దిక్సూచి పనిచెయ్యడం లేదు
సర్వజనావళికి యాత్రాపథంలో సైన్‌పోస్ట్ కూలిపోయింది
చరిత్ర మిట్టమధ్యాహ్నంలో చలివేందిర కనబడటం లేదు
నాగరికత నగరం మధ్య నడిరోడ్డుమీద మూర్ఛపోయింది.

అన్ని విధాలా చెడ్డరోజని అన్ని పంచాంగాలూ ఒప్పుకున్నాయి
స్వప్ననయనం ఛిన్నహృదయం నేటి చిహ్నంగా నిలిచిపోయాయి
అయిదు ఖండాల జిజ్ఞాసువులు ఆలోచనాంధకారంలో చిక్కుకున్నారు
అఖండ కాలనీల కూలంకష పొంగి అందమైన పట్టణాన్ని ముంచివేసింది.

ఆకాశ ద్వారంలో అతనికి స్వాగత తోరణం కట్టారు
రణంలో మరణంలో అజేయుడైన యీ వ్యక్తి అమరుడన్నారు
అవనత మస్తకాలలో అశేష ప్రజానీకం అశ్రుతర్పణం చేశారు
అజరామరమైన అతని వాణి తరతరాలు వింటారు కలలు కంటారు.

* * *

ఈ హఠాత్పరిణామంలో
ఎంత అర్థవిహీనమైపోయింది సర్వం
ఎంతగా కుంగి 'కో' యని విలపించింది నా హృదయం
ఎవరు చెప్పా యింతటి దాకా
ఈ భూవలయంమీద ఇంత హుందాగా ఇంత అందంగా
ఇంత గర్వంగా తిరిగిన మనిషి
ఎవరు చెప్పా ఈ విశాల గగనం మీద

ఈ దిక్కునుండి ఆ దిక్కుకు యింత అర్థవంతంగా
ఆగామి మానవ సంతతికి ఆదేశంగా ఆదర్శంగా
స్వర్ణాక్షర సంకేతాన్ని రచించిన మనీషి
ఎవరు చెప్పా యీ ప్రపంచ చరిత్ర తలుపు తట్టి
లోపలి చీకటిలో గదిగదిలో మూల్గులు వినవచ్చే ఎదఎదలో
ఆశా కర్పూర దీపాన్ని వెలిగించిన నవీన రాజర్షి!
జ వ హ ర్

నలభై ఐదుకోట్ల జనుల ప్రియతమ నాయకుడా
నీవు లేవనే తలపు రానివ్వలేక పోతున్నాను
నిద్దమైన ఈ నిలువుటద్దం మీద పగుళ్లు చూడలేక పోతున్నాను
ఈ దేశంలో ఏ హృదయద్వారం తెరిచినా
సాలోచనగా జాలిగా గంభీరంగా నిలబడే నువ్వు
ఈ దేశంలో ఏ దారి మలుపు తిరిగినా
అక్కడ నీ పదాంకం నువ్వు కట్టిన యిల్లు ధైర్యంగొలిపే నీ చిరునవ్వు
ఎలాగ నీ స్మృతినుండి పారిపోగలను
ఈ దుఃఖాన్ని మరచిపోగలను
మానవోత్తముడవు
మేరునగ ధీరుడవు
అకుంఠిత కార్యదీక్షాదీక్షితుడవు
అపుడే ఎలాగ విడిచిపోయావయ్యా
అసంపూర్ణ చిత్రాన్ని వదలి
అనిబద్ధమాలికను వదలి
ఎలాగ కనుగిలికి తెర తొలగించి నిశ్శబ్దంగా నిష్క్రమించావు
దిగ్భ్రాంతమైన దేశాన్ని విడిచి
దీన మానవాళిని మరచి

★ ★ ★

ఆ తోటలో పువ్వులెప్పుడూ పూస్తాయి
అక్కడ నిత్య వసంతం
గడచిన శిశిరాన్ని తలచుకొని
గజగజ వణక దాచెట్టు
అతడు నిత్య యౌవనుడు
వర్తమానం పదునైన కత్తి

దానినొత్తి చీకటి మొదళ్ళు కోస్తాడు
భూతకాలం నూనెలో తడిపిన వత్తి
దాన్ని మెదిపి భవిష్యద్దీపాన్ని వెలిగిస్తాడు
చారిత్రక దృక్పథం అతని శక్తి
సమ్యక్సిద్ధాంత రథ్యమీద రథాన్ని నడిపిస్తాడు
చరన్మాధ్య క్రూరమృగాల సంకులారణ్యంలో
సహేతుక సాహసం కవచంగా ధరించిన ఆఖేటకుడు
చలజ్జీవన దైనందిన కోలాహల పాంసుపరాగంలో
తనలో తానొక ఏకాంత సౌందర్యం రచించుకున్న స్వాప్నికుడు
అల వివేకానంద రవీంద్ర మహాత్ముల త్రివిధ పథగామి
అనిదంపూర్వ వసుధైక కౌటుంబికుడు మహానాయకుడు

★ ★ ★

ప్రిన్స్ ఛార్మింగ్ డార్లింగ్ ఆఫ్ ది మిలియన్స్ వెళ్ళిపోతున్నాడు
దారి నివ్వండి
స్వప్నశారిక లతని శిరస్సుచుట్టూ పరిభ్రమిస్తున్నాయి
మనవాడు జవహరుడు భారతభూషణుడు కదలిపోతున్నాడు
కన్నీరు విడువకండి
కోటికోటి ఎదల గులాబీలు అతని పాదాలు ముద్దిడుతున్నాయి.
ప్రియదర్శనుడు స్నేహాపండితుడు శాశ్వత నిద్రపోతున్నాడు
సద్దు చేయకండి
విధుర వసుమతి మౌన విషాదగీత మాలిపిస్తున్నది.

*–1964*

★ ★ ★

# వానలో నీతో

ఆకాశాన్ని మేఘం నల్లని కంబళిలా కప్పుకుంది
ఆనందం మనసులో మయూరబర్హంలా విప్పుకుంది
ఆలోచనలెందుకు జవ్వనీ! విలోకించు వర్షాసంధ్యని
సందేహం వదలి నా సందిటిని నిలిచి కళ్ళెత్తి చూడు

అరటితోట నడుంచుట్టి కాలువ ఏటవాలుగా మలుపు తిరిగింది
నారికేళ వనాంతాన ప్లాటినం సంకేతంలా మెరుపు మెరిసింది
నీ వొంటిమీద చిరుగంధ సువాసన నా మనస్సుని చుట్టుకుంది
నిర్నిద్ర కాంక్షారమ్యమై, నీపమై నా జీవితం విరిసింది.

చినుకుల కలనేత వస్త్రాన్ని సింగారించుకుంది ధరిత్రి
సిందువారం పులకరించి చిరుసిగ్గు పూలని పూసింది
ఆకుపచ్చని ఉత్సాహంతో విజృంభించింది ప్రాణశక్తి
ఆనందవల్లరీ! ప్రేయసీ! అందించు నీ అధరామృత సూక్తి.

వానలో, కానలో నాకు అవిరామ ప్రాచీనత స్ఫురిస్తుంది
వార్షుకాభ్రం నాకు యక్షపతీ సౌందర్యాన్ని రచిస్తుంది
బాబిలోనియన్, ఈజిప్టు నాగరికతా స్తూపాలలో నీడలలో
ప్రాణప్రియా! మనమిరువురం మధువు సేవించినట్టు గుర్తుకొస్తుంది.

–1964

* * *

# ప్రవల్లిక

ఏ నిశ్శబ్ద ప్రపంచాల మధ్య
ఏమిటి నీ కళ్ళు మాట్లాడుతున్నాయి
ఉత్తర ధృవంలో మంచువంటి తెల్లని
హృదయం గలదానా ఆడదానా
ఎన్ని పూర్వజన్మల స్మృతుల జాడలు
ఈ క్షణంలో నీ కనురెప్పల నీలినీడలు

నక్షత్రాల మధ్య ఆకాశంవంటి
నల్లని కళ్లదానా ఓ ఆడదానా
సృష్టి ముందటి చీకటిలోంచి ఏరుకున్నా
సౌందర్యాన్ని నీ కళ్ళల్లో నింపుకున్నావు
సృష్టి చివరి లయంలోని శూన్యాన్ని నన్ను
స్పష్టమవని కామంలో బంధించుకున్నావు.

చీకటివంటి నీ విచిత్ర వీక్షణాకర్షణకి
సంధ్యాగగనం మీద ఎర్రని ఆందోళనని నేను
క్షితిజరేఖలా వంగిన నీ భుజాల వొంపు దగ్గర
చెదరి విరిగిన సముద్రపు కెరటాన్ని నేను
ఆడదానా అద్భుతమైనదానా నిక్వణత్ వీణా
అర్థంలేని నన్ను చుట్టుకున్న పరమార్థానివి నువ్వు

దట్టమైన అడవులలోని నిగూఢ రహస్యాలు
దాచుకున్న కన్నులు కలదానా ఆడదానా
స్వర్గనరకాల సరిహద్దుల మధ్య నిలిచి నీవు
సమ్మోహ మంత్రం జపించే శృంగారావధీ విధీ
నాకు తల్లివి నెచ్చెలివి చెలివి
నన్ను కౌగిలించుకున్న పెద్దపులివి

–1964

★ ★ ★

# అదృష్టాధ్వగమనం

అన్నా
నన్నానవాలు పట్టగలవా?
ఆనాటివాణ్ణి, నీ చెలికాణ్ణి
అవునులే కాలమొక్కటే కాదు మన మధ్య దూరం
లౌకిక జగత్తు కల్పించిన వ్యత్యాసాల విశ్వాసాల పూర్వార్ధగోళంలో
ప్రయోజన విజయ పరంపరల పాలరాతి మేడమీద చిటారుగదిలో నువ్వు
నేనో మరి ఇంకా సమాజంలో
స్థూలమైన ఆకృతిని అస్తిత్వాన్ని పొందని పొందలేని ఊహామరుత్తని,
ఏకాకిని

ఇంకా అలాగే ఉన్నాను
రేగిన జుట్టుతో, నలిగిన షరాయితో
కలలరంగు దుమ్ముపడిన కళ్ళమంటలతో
ఇంకా అలాగే తిరుగుతున్నాను
నీహార ప్రతిసీరల మధ్య
నీరవ నదీ తీరాలవద్ద
నిరస్తపత్ర తరుశాఖల క్రింద
ఇలాగే తిరుగుతూ తిరుగుతూ
ఒకే ఒక తీగ మాత్రం మిగిలిన ఈ సితారని మోసుకుని
ఈ నిశాముఖాన నిలిచి పాడుకొంటున్నాను
ఎవరూ వినని పాటని
ఇలాగే నడుస్తున్నాను
ఎవరూ నడవని బాటని
అన్నా
నువ్వన్నీ అమరిన అదృష్టశాలివి
ఇల్లూ వాకిలీ డబ్బూ హోదా పేరూ ప్రతిష్ఠా
వెండిమెట్ల నిచ్చెన లెక్కుతున్న వేళ
నేనొక రావిచెట్టు నీడలో

కొమ్మమీద ఆహారం దొరకని కృకలాసం కంగారు చూపులో
ఊరవతల సందులలో

దుమ్ముకొట్టుకుపోయిన పిల్లల కళ్ళలో ఆరిపోతున్న వెలుగులో
కాలవ ఒడ్డున వంకర తిరిగిన తుమ్మచెట్టు కొమ్మలోంచి
కాలి మసైపోతూన్న పశ్చిమదిశా గగనంలో
ఒక భయంకర సృష్టిక్రమాన్ని మానవయత్న వైఫల్యాన్ని
ఊహించుకుని ఒణికిపోయేవాణ్ణి

మంచుబొట్లు రాలిపడే
మసక మసక వేకువ పోక చెట్లకింద
కన్నీటితో వెతికేవాణ్ణి
నన్ను కికురించిన కలకోసం
నా కోర్కెల వెలుగుల వజ్రం కోసం

అర్ధరాత్రివేళ
ఊరి పొలిమేరలో తోటలో
రాలిపడిన నక్షత్రాన్ని నిర్జరీ సురుచిర స్వప్నాన్ని
ఏరుకొని జేబులో దాచుకుందామని
ఎంత ప్రయత్నించేవాణ్ణో
అపుడు నా వీపుమీద తారల తళుకు
నా నొసటమీద క్రొన్నెలవంక కులుకు
నన్ను చూసి వీడు పిచ్చివాడనీ మాంత్రికుడనీ
అవహేళన చేశారందరూ.

అన్నా
నే పుట్టినప్పుడు
ఏ పిచ్చి పొగడ పువ్వుల గాలి సోకిందో
ఏ పండువెన్నెల మత్తు కమ్మిందో
ఏ పికిలిపిట్ట కిటికీలోకి వ్రాలి నాకేసి చూసి నవ్విందో
ఇలాగ ఇంద్ర ధనుస్సుల్ని అదృశ్య స్వర్గాల్ని అశ్రుత గాంధర్వాన్ని
అన్వేషించుకుంటూ
మామూలు దారుల్నీ మర్యాదల్నీ మంచి చెడ్డల్నీ విడిచి
రాత్రిందివా మధ్య రహః కిర్మీర రథ్య పడిపోతున్నాను
ఆశతో విశ్వాసంతో ఆత్మబలంతో

కాని ఎన్నెన్ని అఘాతాలు అడ్డంకులు
ఎన్ని వేదనావాదనాయుతమైన విశ్వాసాలు
ఈ గుండెలో ఎన్ని గాయాలు.

అన్నా
నేనొక జ్వాలా వలయితుణ్ణి దుఃఖితుణ్ణి
నా లోపల నా బాధలు
నావెలుపల క్షతజగత్తు ఆక్రోశించిన కరుణా బీభత్సరవాలు
నిరంతర పరిణామ పరిణాహ జగత్కటాహంలో
సలసలకాగే మానవాశ్రుజలాలు

అయినా
అంతర్గత సంగీతం అనుపమ సుందరగీతం
నాలోపల వినబడుతూ నన్నిలాగ నడిపిస్తూ
సృష్టిలోని అర్థంకోసం జన్మలోని సాఫల్యంకోసం
జననమరణాతీతమైన సురభిళ రహస్యం కోసం
ఎన్ని ఎడారి దారుల
కంటకిత కానన మార్గాల
పడుతూ లేస్తూ
పడుతూ లేస్తూ

ఒక్కొక్క తీగ తెగుతూ
మిగిలిన యీ విచిత్ర విపంచికను మీటుకుంటూ
ప్రతి గడపముందు ప్రతి గవాక్షం ముందు
నిలబడి పాడుతున్నాను పిలుస్తున్నాను
ప్రతి తెరనీ తొలగిస్తున్నాను
ప్రతి అరనీ తెరుస్తున్నాను.

అన్నా
నన్నింకా గుర్తుపట్టలేక పోతున్నావు
అన్నీ పోగొట్టుకున్నా నాలో ఆనందం తరగలేదు
ఆకాశమంత నా ఏకాంతంలో
అనంత మానవ హృదయ స్పందనం వినడం మానలేదు
అలసిన నా ప్రవాసంలో
అద్భుతసౌధాల మణి కవాటాలు తెరచు కోవటం మానలేదు

మీ వాణ్ణి మీ అందరి మధ్యా బతుకుతున్న వాణ్ణి
అయినా నిలువెత్తు తెరవెనక నిలిచిన నేపథ్య గాయకుణ్ణి
ఇప్పటికీ మధుమాసంలో
సహకార తరువుల కింద పవ్వళించిన వేళ
నా గళాన సౌందర్య మధూళి చిందుతుంది
ఇప్పటికీ దిగులు నీరు నిండిన
కోటి మనస్సరస్తీరాల నా కవిత
కోరికల కోణాకారపు కొత్త చెట్లని నాటుతుంది
ఇప్పటికీ ఈ చీకటి మొగలో
నిలిచి పాడుతున్న నా కోసం
కుబుసం విప్పిన గోధుమవన్నె తాచు
మొగలి పొదలనుండి పడగవిప్పి ఆడుతుంది
ప్రాగ్దిశా సుందరి ఖండచంద్ర పరిదీపిత కపోలాల హసిస్తుంది
నా గుండెలపై శుక్రతార కిరణం సూటిగా వచ్చి వాలుతుంది.

*–1964*

★ ★ ★

# నవత-కవిత

మిత్రమా
కవిత వున్నప్పుడే నవత రాణిస్తుంది
అసలు కవితలోనే నవతకూడా వుంది
కాని, మోడరన్‌గా వుందామనీ, ఏదో అందామనీ
తనకే తెలియని అస్పష్టపు అనుభూతిని
అర్థంలేని ఇమేజరీతో కలగాపులగపు వర్ణనలతో
డిలాన్ థామస్‌కు చేతగాని అనుకరణలతో
ఒకదేశం నిర్దేశంలేని వాక్యాల వికారంతో
ఎందుకు బాధిస్తావు నన్ను, బాధపడతావు నువ్వు!

"రాత్రి రెండో జాములో రెండు కత్తుల్ని తిన్నాను
గుండెమీద, గుండుమీద సల్ఫ్యూరిక్ యాసిడ్ పోసుకున్నాను
నా పెదవుల్ని కత్తిరించి నీ వీపుమీద అతికాను
ఈ నిముషంలో విషంలో నా నేత్రాలు సువర్ణ ఝషాలు"
ఇలా రాయడం కొత్తగా, గమ్మత్తుగా ఉంటుంది కాని, ఇది నాన్సెన్స్
ఇది పసితనం ప్లస్ వెర్రితనం ఇంటూ డికడెన్స్
ఈ కషాయం వికటిస్తుంది,
ఈ వ్యవసాయం వెర్రితలలు వేస్తుంది.

కవిత్వంలో అబ్‌స్క్యూరిటీ కొన్ని సందర్భాలలో ఉండొచ్చును,
కాని, పాఠకుడికి నీ అనుభూతి ఆకారం అందాలి హత్తుకోవాలి.
అది ట్రాన్స్‌పరెంట్ చీకటై ఉండాలి, నిన్ను పలకరించాలి.
కవిత కొత్త అనుభవాల కాంతి పేటికను తెరవాలి, కదలించాలి
ప్రతి మాటకీ శక్తి వుంది, పదును ఉంది
ప్రతి చిత్రణకీ అర్థం ఉంది, ఔచిత్యం ఉంది
గులకరాళ్ళ డబ్బా మోగించి గొప్ప సంగీతం అని దబాయించకు
అలిగి నన్ను శపించకు, అన్నా; నీమీద నాకు కోపంలేదు.

గంతలు కట్టినంతమాత్రాన గాడిద గుర్రంకాదు
ఖద్దరు ధరించిన ప్రతివాడూ గాంధేయుడు కాడు
ఆధునికత ఉన్నంతమాత్రాన ప్రతిదీ శిరోధార్యం కాదు
ఆహార్యం మార్చినంత మాత్రాన సామాన్యుడు మహారాజవడు
అంత్యప్రాసలు వేసినంతమాత్రాన ప్రొసైక్ భావం పొయెట్రీ అవదు
కవిత్వం ఒక అల్కెమీ, దాని రహస్యం కవికే తెలుసును
కాళిదాసుకు తెలుసు, పెద్దన్నకి తెలుసు
కృష్ణశాస్త్రికి తెలుసు, శ్రీశ్రీకి తెలుసు.

ఈ కాలంలో బ్రతుకు, యీ ప్రపంచాన్ని ప్రతిఫలించు
ఇంటికున్న కిటికీలన్నీ తెరచి అన్ని పవనాల్నీ ఆహ్వానించు
నువ్వు చెప్పేదేదైనా నీదై వుండాలి, నీలోంచి రావాలి – చించుకుని రావాలి.

మాటలు పేర్చడం కవితకాదు, మంత్రం తంత్రం అసలేకాదు
మళ్ళీ యీనాడు చిత్రకవితల్నీ, అయోమయబంధాల్నీ పునరుద్ధరించకు
నిగ్రహ ప్రగ్రహాలులేని భావాశ్వాలని బరిమీద వదలకు.

అన్నా! కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాలి విస్తరించాలి
చైతన్య పరిధి
అగ్ని జల్లినా, అమృతం కురిసినా
అందం, ఆనందం దానిపరమావధి.

–1964

★ ★ ★

# సి.ఐ.డి. రిపోర్టు

అయినాపురం కోటీశ్వరరావు
అకాలంలో కాలధర్మం చెందడంలో
అంత రహస్యంగాని, కుట్రగాని, శత్రు ప్రయోగంగాని లేవని
రూఢిగా తెలియవస్తోంది పరిశోధనల ఫలితంగా

అయితే డీలక్స్ హోటల్లో, మూడో అంతస్తులో, పదమూడో నంబరుగదిలో
అలా మాట్లాడుతూ చనిపోవడం సభ్యతకాదన్న విషయం నిర్వివాదాంశం
స్వామి విధేయుడైన గుమాస్తా కోటీశ్వరరావు ఆఫీసు పనిమీద వెళ్ళివుంటే
సొంతంగా పని అయేలోపున చనిపోవడం డెరిలిక్షన్ ఆఫ్ డ్యూటీ అనొచ్చు.

మూడంతస్తుల వరకూ ఉన్న మేడ మెట్లెక్కడం వలన
(లిఫ్టు అంటే అతనికి భయం, ఎప్పుడూ దాన్ని కోరలేదు ఉద్యోగంలో)
విధేయుడైన అతని విధేయపు గుండెలు
ఎదురుతిరిగి శలించడంవల్ల అనొచ్చును.

ఏమైనా కోటీశ్వరరావు చనిపోవడం నిజం
డాక్టరు తీర్పుకన్న మేనేజరురాగానే లేచి నుంచోక పోవడమే
ఇందుకు నిదర్శనం.

ఇతని తాలూకు వివరాలేమీ ప్రమాదకరంగా లేవు
ఇతని తండ్రి గుమస్తా, తాత గుమస్తా, ముత్తాత గుమస్తా
సాంప్రదాయకమైన వినయ విధేయతలకీ, గౌరవకరమైన దరిద్రానికీ
వీళ్ళ వంశం ఒక రాస్తా

ఇతనికి యింట్లో ఆరుగురు పిల్లలూ, ఒక ముసలి తల్లీ, బక్కపిల్లీ
ఒకర్తె నీరసంగా ఉన్న భార్య
ఇతనద్దెకున్న వాటాలో రెండున్నర గదులూ, ఒక టెలివిజన్ లాంటి
బాత్‌రూమూ ఒక అటకా

ఇతను ఎర్రచొక్కాలు ధరిస్తాడు, కాని కమ్యూనిస్టు కాడు
ఇతను సందుల్లోంచి నడుస్తాడు, కాని స్యర్రియలిస్టు కాడు
నడుస్తూ నడుస్తూ నవ్వుతాడు, గొణుక్కుంటాడు,కాని యోగి కాడు
అలా ఆకాశంకేసి వెర్రిగా చూస్తాడు, కాని అసలు కవేకాడు
ప్రతినెలా పాలబాకీ, కిరాణాకొట్టుబాకీ అణాపైసలతో యిచ్చేస్తాడు
అందుకని ఆఖరివారంలో భార్యతో కలిసి రాత్రుళ్ళు వస్తుంటాడు
హరికథలకీ, వీధినాటకాలకీ అప్పుడప్పుడూ వెళుతుంటాడు
వీ. డీ. లు ఎందుకొస్తాయో తెలియదు, ఆఖరుకి
బీడీలు కాల్చడమైనా ఎరగడు.

ఏడాదికో సినిమాకెళ్ళి క్యూలో ఆఖర్న బుద్ధిగా నిలబడతాడు
రాజకీయ సాహిత్య సాంఘిక సంస్థలలో దేనికీ సభ్యుడుకాడు
ఎన్నికలలో వోటు పై ఆఫీస రెవరికిమ్మంటే వారికిస్తాడు
ప్రతి శనివారం దేవుడు పటాన్ని పూజిస్తాడు, పటికబెల్లం ప్రసాదం
తింటాడు.

లంచాలు పట్టడు, ఎవర్నీ తిట్టడు, ఎవరేమన్నా పట్టించుకోడు
నీతీ నిజాయితీ వున్నవాడు, నిర్మలమైన దైవభక్తి వున్నవాడు
కాని – చనిపోయే ముందురోజునే కనకయ్య అనే మిత్రుణ్ణి కలుసుకుని
"సుఖమంటే ఏఁవిటి? ఎలా వుంటుంది? ఎక్కడ దొరుకుతుంది?" అని
అడిగాట్ట

ఈ సందేహం అతని జీవితానికే మచ్చ
ఇంకా పెరిగి పెద్దదవకుండా అతను మరణించడం దేశానికే రక్ష
–1965

★ ★ ★

# నేనుకాని నేను

నాకు మీ సాహిత్య వివాదాలు తెలియవు
నలుగుర్నీ మంచి చేసుకోవడం అంతకన్నా తెలియదు.

ఒక నిశార్ధ భాగంలో నక్షత్ర నివహగగనం
ఒరగా భూమ్మీదకు వొంగి ఏదో రహస్యం చెబుతూన్న వేళ
ఒంటరిగా నా గదిలో నేను మేల్కొని రాసుకుంటుంటాను
నా హృదయ స్పందనమాత్రం నాకు వినిపిస్తూ వుంటుంది
ఎదురుగా గోడమీద బల్లి ఏకాగ్రంగా నాకేసి చూస్తూ వుంటుంది
కిటికీ అవతల ఫెరస్‌మొక్క క్రీగంట కనిపెడుతూ వుంటుంది
కీచురాళ్ళ చప్పుడు, అప్పుడప్పుడు వినిపిస్తూ వుంటుంది.

పాత ఇటికల గుట్టలో మెలికలు తిరిగిన పాము బద్ధకంగా కదులుతుంది
అదే సమయంలో లేత ఎరుపు ఆవేశాన్ని వొంటినిండా కప్పుకుని
కడుపులో వణికించే చలి కనబడకుండా ఆలోచనల మంటలంటించి
కళ్ళచివర నేనుకాని నేను నీవలపు దూరాన్ని ముడివేసుకొంటూ
గొణుక్కుంటూ పాడుకుంటూ ఏదో రాసుకుంటున్నాను.

నా లోపల ఎవరో చప్పున ఇటునుంచి అటువైపు వెళ్ళిపోతూ
ఆనవాలుగా వదులుతారు యిరవై యేళ్ళనాటి జ్ఞాపకాల్ని
నా గది అవతల ఎవరో నవ్వుని నొక్కిపట్టిన ధ్వని నీళ్ళని కలచినట్టు
రోదసిలో చీకటిలో అంతర్హిత సంగీతం తాలూకు శ్రుతి చుట్టుకొన్నట్టు
మంచూ మసక వెన్నెలా కలిసిన శీతాకాలపు రాత్రి గుండెలమీద
మరకలా పడుతుంది నా నిట్టూర్పు ఏకాంతంమీద నా తీర్పు
ఎందుకు రాస్తున్నావంటే ఏం చెప్పను యెవరికి చెప్పనిప్పుడు
గోడమీద బల్లి విసుగ్గా వెళ్ళిపోయింది ఫెరస్‌మొక్క నిద్రపోయింది
ఆకాశం నక్షత్రాల్ని జారవిడిచి అంత యెత్తుకు యెగిరిపోయింది
నా చుట్టూవున్న తెరలు జారిపోయాయి నాకు నిజంగా మెలకువ వచ్చింది
కిటికీలోంచి శిశిరర్తు క్షీణ చంద్రరేఖ గిలగిల్లాడినట్టు కనిపించింది

★ ★ ★ – *1965*

# నిన్న రాత్రి

ఒకమాట చెప్పా
నిన్న రాత్రి దేవుడు వచ్చి నా మంచం మీద కూర్చొని
దీనంగా నాకేసి చూసి కన్నులు దించుకున్నాడు
ఏమైనా అన్నానా? నే నేమైనా అన్నానా?

ఆకలి అని ఆశలు గొని అన్నింటా విఫలుడై
ఆత్మహత్య చేసుకున్న అబ్బాయిని గురించి అడిగానా?
అమ్ముకొని యౌవనం, అలసిన జీవనం
సాగించి సాగించి సంధ్యవేళ ఉరి తీసుకున్న
సానిపడుచు మాట చెప్పానా?
చీనాతో యుద్ధంలో చితికిన కొడుకు వార్తవిని
చీకట్లో ఏట్లో దూకిన ముసిలిదాని పసరుగుండె
నే చూపించానా?
కాంగోలో, క్యూబాలో, సైప్రస్‌లో, లావోస్‌లో
కాలి కమురు కంపుకొట్టే కాలం కథ, మానవ వ్యథ
నే వివరించానా?

నిజం చెప్పా, నిజం చెప్పా
నిన్ను గూర్చి, నన్ను గూర్చి
నిఖిల సృష్టిలోని ఖిలం గూర్చి
నీరవ సుందర హృదయపాత్ర
నిండిన హాలాహలం గూర్చి
నిజం చెప్పమని అడిగానా? నిందించానా? నిర్బంధించానా?

నాకు తెలుసు, నాకు తెలుసు
గొలుసులోని అసలు కిటుకు
నాకు తెలుసు, నాకు తెలుసు
దేవుని చెక్కిళ్ళమీద దీనంగా జారే కన్నీటిని

దీపకాంతిలో చూసి చటుక్కున జాలితో లేచి
కౌగిలించి, ఊరడించి
కన్నీటిని తుడిచి
వెళ్ళిరమ్మని వీధి చివరిదాకా సాగనంపి వచ్చాను,
నాకు తెలుసు, నాకు తెలుసు
మానవుడే దానవుడై తిరగబడినప్పుడు
పాపం పెద్దవాడు - కన్నకడుపు - ఏం చేస్తాడని!

*–1965*

★ ★ ★

# కిటికీ

కిటికీ తెరిస్తే
గాలీ వెలుతురుతో పాటు
జాలి జీవితపు ధూళీ జ్ఞానమధూళీ కూడా వస్తాయి
తెరచే కిటికీని బట్టి
పరతెంచే పుష్పపరాగం వుంటుంది
గదికీ మదికీ కూడా గవాక్షా లుంటాయి
అంతరిక్షంలోకి జీవిత రహస్యంలోకి సృష్టి సమక్షంలోకి
విచ్చుకొనే విచిత్రాక్షి సమూహాలు
ఆనంద శోకానుభూత్యవిరళ తటిచ్ఛకిత వార్షుక వలాహకాలు

* * *

కిటికీ తెరిస్తే
కనబడుతుంది క్షితిజరేఖ
నాకూ అనంతానికీ మధ్య వ్రాలిన విలీన తమాలశాఖ
నాలోంచి కిటికీ అవతలికి దిగంతాలకి వ్యాపిస్తున్న నేను
బయటినుండి కిటికీ లోపలికి సంకోచించుకు పోతున్న నేను
ఒకే ఒక కేంద్రంలో కలుసుకున్న ఉద్రిక్త క్షణంలో
ఉన్మదిష్ణువు సృష్టి వేణువూదిన రహస్యగానం వినబడింది
ఉత్తాల శిఖరంమీద పగిలిన సూర్యగోళపు కాంతి చెల్లాచెదురైంది
ఉదారంగు మంచు కురిసిన ప్రథమోదయదృశ్యం నాకు కనబడింది.

* * *

కిటికీ తెరిస్తే
రోడ్డుమీద వచ్చీపోయే జనం
ఆశానిరాశల వంతెనల మీదనుంచి దిగుతున్నారు
ఆకలీ కామం అవసరాల మార్కెట్‌కి వెడుతున్నారు

ఒకడు కంగారుగా ఒకడు రహస్యంగా ఒకడు బెదురుగా
ఒకడు ధైర్యంగా విలాసంగా మరొకడు కింగ్లీగా
ఆవిడ తలవంచుకుని నిత్యపాతివ్రత్య భారవహనంతో
ఈవిడ ఓరగాచూస్తూ పైట సవరించుకుంటూ లోపల్లోపల
గతుక్కుమంటూ
రోజుల స్తంభాల చుట్టూ తిరుగుతూ
కాలం కారిడర్లలోకి మసక మసక చీకట్లో సిలౌటీలు కల్పిస్తూ
ఎవరికివారే ఏకాంత పాంథులు
అదృశ్య శృంఖలాబద్ధ పాదాల నీడుస్తూ ఏడుస్తూ చప్పట్లు చరుస్తూ
కోలాహల హాలాహల నీలాచల గుహాంతరాళవైపు
కోష్ణకవోష్ణ స్వప్న రంభా పరీరంభపుకైపు
కోసం పోతున్నారు
దిగులుగా తిరిగి వస్తున్నారు
మూలగా నక్కి మూటవిప్పి చూసుకుని
ఏమీ దొరక్క మరేమీ తెలియక
మళ్ళీ అడ్రసులేని ఆనంద ప్రియబాంధవి కోసం
మరో మలుపు మరోదారి మరోవ్వూరు వెళ్ళాలని
మంచుకప్పిన స్టేషన్ల దగ్గర విమానాశ్రయాల దగ్గర
పడిగాపులు పడి నుంచున్నారు
ఎడ్వాన్సు బుకింగ్ లేదు ఎప్పుడు రైలొస్తుందో తెలియదు
సిగ్నలిచ్చేవాడు తన గదిలో చిత్తుగా తాగి పడుకున్నాడు.

*　　　　*　　　　*

కిటికీ తెరిస్తే
ఏపుగా పెరిగిన చెట్టుమీద ఎర్రని పువ్వొకటి విరిసి
ఎండలో మెరుస్తూ ఇదేనిజం ఇదేనిజం అని నవ్వుతూ
అంతలో రాలిపోయింది
వింతగా స్మృతిలో మాత్రం మిగిలింది.

*–1965*

★ ★ ★

# నువ్వులేవు నీ పాటవుంది

నువ్వులేవు నీ పాటవుంది; ఇంటిముందు జూకామల్లె తీగల్లో అల్లుకుని
లాంతరు సన్నని వెలుతురులో క్రమ్ముకుని నా గుండెల్లో చుట్టుకుని
గాలిలో ఆకాశంలో నక్షత్రం చివరి మెరుపులో దాక్కుని నీరవంగా
నిజంగా వుంది జాలిగా హాయిగా వినపడుతూ వుంది శిశిర వసంతాల
మధ్య వచ్చే మార్పుని గుర్తుకి తెస్తోంది యిన్నేళ్ళ తర్వాత వేడిగాలి
చల్లదనానికి తిరిగే ఒకానొక గ్రీష్మ దివసావసాన సమయాన
డాబామీద

సిగ్గిలిన సోగకళ్లతో మల్లెపూల వాల్జడతో నువ్వు పాడిన పాట
నా గుండెల దగ్గర తడబడుతూ ఏదో కొత్త భాషలో చెప్పి
ఒక అందమైన రహస్యం విప్పి పరువానికి వస్తున్న నా వయస్సులో
చటుక్కున పరిమళపు తుపానుల్ని రేపి మహారణ్యాల సౌందర్యాన్ని
చూపి సముద్రపు కెరటాల జలంతో మధ్యగా మౌనంగా వున్న
ద్వీపాల్ని ఊపి
ప్రపంచంయొక్క అవధుల్ని దూరంగా సాచి నన్ను దిగంతాలకి
విసిరేసిన వేళ

ఇజాలూ రాజకీయాలు వాదాలూ హత్యలూ యుద్ధాలూ
ఇంకా ఇటువంటి చెత్తా చెదారం మనస్సులో పేరుకోకముందు
పండిన మొగలి పొత్తివంటి పరిమళంగల ప్రారంభయౌవనపు నిండైన
ఆరోగ్యపు వాకిళ్ళముందు విరిసిన నందివర్ధనం పువ్వుల మధ్య
నువ్వూ నేనూ కూర్చొని అలాగ ఒకర్నొకరు చూసుకుంటూ
ఆకాశానికీ భూమికీ మధ్యపడిన చిరుచీకటి పలకమీద
రేడియం అక్షరాన్ని వ్రాసుకుంటూ
కాలాన్ని కదలకుండా నిలబెట్టి కమ్మని ఊహల పూలతోటల మధ్య
పరుగులెత్తి సాహసపు మంచుకొండల అంచులమీద స్కేటింగ్ చేసి
అకలుషితమైన యౌవనోల్బణంతో బలంతో అమాయకత్వంతో
ఆకాశాల ఆశల మేలు చాందినీలు కట్టి

నీ నా సామీప్యమే స్వర్గంగా ప్రవంతిగా జీవిత
పరమార్థంగా ఎంచి
నలుపు చారలులేని తెల్లని సూర్యకాంతి పడిన పాలరాతి గచ్చులా
ప్రతిఫలించి
నీ వొడిలో నా తల పెట్టుకుని అభ్యంగనావిష్కృత త్వదీయ
వినీల శిరోజ తమస్సముద్రాలు పొంగి నీ బుజాలు దాటి నా
ముఖాన్ని కప్పి ఒక్కటే ఒక స్వప్నాన్ని కంటున్న వేళ
చంద్రికాస్నపిత సంగీతాన్ని వింటున్న వేళ

ఆకు పచ్చని భూమికీ గిరులకీ ఝురులకీ సమస్త సృష్టికీ
ఒకే అర్థం కనుక్కున్న వేళ
నీ పాట హాయిగా గాలిలో తేలి మునిమాపు జేగురులతో కలసి
దిక్కులను చుట్టినీ మృదు చలాంగుళిచ్ఛవిలో కరిగి
నా వొంటిని విమిరి నన్ను నిర్నిద్ర నిద్రలో పడవేసి నీ ఎర్రని
పెదాలు నా నొసటిమీద ఆనందపు నెలవంకల్ని చిత్రించి నన్ను
మంత్రించిన ఆ రోజులింక
రావు యిప్పుడు నువ్వులేవు నీ పాటవుంది నా లోపల లోపల
ఆరిన కుంపటిలో రగులుతున్న ఒకే ఒక స్మృత్యాగ్ని కణంలాగ
క్రమక్రమ జరా రుజాగ్రస్తమైన వయస్సనే పాడింటి మూలగదిలో
కుండిలో యింకా వాడకుండా నిల్చిన పువ్వుల గుత్తిలాగా
గడుసుదనం మోసం పరువూ ప్రతిష్ఠలనే గాడిదలమీద
బ్రతుకు పాతబట్టల మూటల్ని వేసి తోలుకున్న వేళ

నా ఏడుపు నాకు తప్ప లోకానికి వినిపించనివేళ
నే కూరుకుపోతున్న చాతకానితనపు వానాకాలపు బురదమధ్య
నీ పాట ఒక్కటే నిజంలాగా నిర్మలమైన గాలిలాగ నిశ్శబ్ద నదీతీరాన్ని
పలకరించే శుక్తిగత మౌక్తికంలాగ
ఇంటిముందు జూకామల్లె తీగలో అల్లుకుని లాంతరు వెలుతుర్లో
క్రమ్ముకొని నా గుండెల్లో చుట్టుకుని గాలిలో ఆకాశంలో
నక్షత్రం చివరి మెరుపులో దాక్కుని నీరవంగా నిజంగా వుంది
జాలీగా హాయిగా వినబడుతూ వుంది
శిశిర వసంతాల మధ్య వచ్చే విచిత్ర మధురమైన మార్పుని
గుర్తుకి తెస్తోంది యిన్నేళ్ళ తర్వాత —1965

★ ★ ★

# అభినవ ఋగ్వాదం

తాజా సరుకు – తరుణం పోనివ్వకు
బాదం జీడిపప్పు– కవిత్వం అణా ఒక కప్పు
ఆడదాని అందంలాంటి అబద్ధాన్ని
అలభ్యమైన ఆనందంలోని రహస్యాన్ని
రెండూ కలిపి
రెండు గుక్కల్లో తాగు
రెండవ కంటివాడికి తెలియకుండా గుండ్రంగా చచ్చిపోతావు
ఎండా వానాలేని ఉన్మాద స్వర్గంలో పునర్జన్మిస్తావు.
(అప్పులవాళ్ళూ ఆఫీసర్లూ అనాకారి భార్యలూ యింక బాధించకుండా)

## 2

సుబ్బారావు పెళ్ళాం సూర్యంతో లేచిపోయిన రోజున
కురిసిందిట కదూ కుంభవృష్టిగా వాన
ధార్మికులు దాన్ని దేవతల కన్నీటిసోన అన్నారు
నాస్తికులు రొమాంటిక్ తోటలో పూలతేనె అన్నారు
అసలు సుబ్బారావు నీతిశతకం రాసి అంతకుముందు రోజునే
అర్ధాంగికి అంకితమివ్వకపోతే ఇంతపని జరిగుండదని
గుడిపాటి వెంకటచలేయుడు గుండెబాదుకు చెప్పాడుట.

## 3

అన్నాడు ప్రియురాలితో అన్నమాచారి
జూనియర్ యమ్.యస్.సి. ఫిజిక్స్
ఇదివరకు నీవైపు న్యూటన్ థియరీ ప్రకారం ఆకర్షింపబడ్డాను
అయిన్‌స్టీన్ వచ్చాక థియరీ ఆఫ్ కర్వేచర్
ఆధారంగా నిన్ను ప్రేమించాను

ఇప్పుడెలాగు చెప్పు
హోయల్ నర్లేకర్లు వచ్చి అంతా ఉల్టాసీదా చేశారు
ఇంక నిన్ను అన్ సైంటిఫిక్‌గా దేశవాళీగా ఆహ్వానిస్తాను
అపుత్రస్యగతిర్నాస్తి – అతివా నాకొక కుమారుణ్ణి ప్రసాదించు

## 4

నవలలు నవలలు రాసేస్తున్నారు
కవలల్ని క్వాడ్రుప్లెట్సుని సృష్టిస్తున్నారు (నవలల్లో)
వచనమైనా రచనమైనా పై చెయ్యి వాళ్ళదే
వచనం వదలి మగవాళ్ళు ని
ర్వచనంలేని కవితా కంటక వనాంతరాల పడి
ప్రవాసులై నిర్వాసులై పోతున్నారు
వర్ణనీయవస్తువే తిరగబడి వర్ణిస్తూంటే
కంచెయే చేను మేస్తూంటే–
*హతవిధీ! ఇది కలికాలం, కలికికాలం!*

★ ★ ★

# దుర్మరణవార్త

అంతరిక్ష వలయంమీద
అవనీతల హృదయంమీద
కెనడీ దుర్మరణవార్త
కారుచిచ్చు అక్షరాల
లిఖించింది.

నివ్వెరపడింది జగత్తు
నిజం నమ్మలేక పోయింది
చరిత్ర కేదో శాపం వుంది
ధరిత్రిమీద పాపం నిండింది
మానవప్రగతికి శ్రమించే
మంచివాళ్ళు మహాత్ములు
క్రూరంగా ఘోరంగా మడిసిన
దారుణ విధివిలాసానికి అర్థం ఏమిటి?
బాపూజీ హత్య విషాదగాథ
ప్రతిధ్వనించింది మళ్ళీ మనలో
మహాత్ముల మనీషుల రుధిరంతో
మరకపడింది ధరిత్రీ వదనం.

★ ★ ★

# నగరంమీద ప్రేమగీతం

ట్యాంక్‌బండ్ సన్నని నడుంచుట్టూ చెయ్యిచుట్టి
అందమైన నగర ముఖాన్ని దగ్గరగా తీసుకుని
ఆశలతో అలసమైన అబిడ్స్ కళ్ళలోకి చూసి
దీపాల వెలుతురు ప్రతిఫలించే చెక్కిళ్ళపై ముద్దు పెట్టుకో

సిగలో నౌవహోడ్ నాగరం తళుక్కున మెరుస్తుంది
బంజారాహిల్స్ వక్షోజాలుద్రిక్తంగ చలిస్తాయి
అలా అలా నైలాన్ చీరకింద మెత్తని గాగరాలో
సికిందరాబాద్ జఘనోరు సౌందర్యం నిన్ను కవ్విస్తుంది.

వేలవేల బార్లలో కొన్నివేల నిషాగీతాలమధ్య
బాలిగొలిపే జవరాలి నృత్యం పరవశింప చేస్తుంది
ఓరగా తెరచిన జనానాల తలుపులలోంచి
ఉండి ఉండి నిలవగాలి వస్తుంది
హుసేన్‌సాగర్ మీద ఒలికిన వెన్నెలలోంచి
ఒక విరహిణి మధు విషాదగాథ వినిపిస్తుంది.

వాడినపువ్వుల వాసన వేడివేడి పాదాలకు తగులుతుండగా
రోడ్లమీద అజ్ఞాతకామం ప్రతిరోజూ రాత్రి ప్రవహిస్తుంది
తెలుగువాళ్ళ తెలివిలేనితనం ధోవతి కుచ్చెళ్ళతోపాటు మోటుగా
యం. యల్. ఏ. క్వార్టర్స్ దగ్గర ఎబ్బెట్టుగా జీరాడుతుంది.
దర్బారులో సిగ్గుల్నీ, వగల్నీ ఒలకబోసే నెరజాణతనంనుండి
దాపరికంలేని పారిశ్రామిక నాగరికతా నగ్నత్వంలోకి
ఎదుగుతూన్న నగరసుందరిని ఒదులొదులుగా కౌగలించుకో
మదం, మదం, మృగమద పరిమళం మత్తెక్కిన కన్నుమూతలో
పెట్రోలు వాసన ఫెళ్ళుమని తగిలి ఉలిక్కి పడతావు

మూసీనది మృతకళ్ళంగారాన్నీ, పాపకశ్మలాన్నీ
మౌనంగా, దీనంగా మోసుకుపోతూ వుంటుంది,

ముసలిగద్ద చార్మినార్ మీద గత వైభవాన్ని తలుచుకుని
మూలుగుతూ "మోసం!" అని అరుస్తుంది.

అయినా యౌవనం తగ్గలేదు, లావణ్యం తగ్గలేదు
మెహబూబ్ జిందాబాద్!
ఫ్యూడల్ రహస్యాల్ని నేటికి దాచుకున్న
పుండ్రేక్షు కోదండం హైదరాబాద్!

–1956

★ ★ ★

# నగరంలో హత్య

హైదరాబాద్ నన్ను గుర్తించలేదు పలకరించలేదు
పెద్ద పెద్ద వీధుల్లాంటి పైట సవరించుకుంటూ
తప్పుచేసిన ఆడదానిలా తప్పించుకు తిరిగింది
ఎదురుపడి నే పలకరించినా ఎత్తైన మేడల గర్వంతో
దురుసుగా నిర్లక్ష్యంగా దూసుకొని పోయింది
అనుమానంగా చూసి నన్నవమానించాలనుకుంది

నేనపరాధపరిశోధకుణ్ణి కాదు
నీ శత్రువులు పంపిన గూఢచారినీ కాదు
నీ మొహబత్ కీరాత్‌కి మోజుపడి వచ్చినవాణ్ణి కాదు
ప్రతిరోజూ ఉదయం ఎండలో అడవిలో తిరిగి తిరిగి
రకరకాల పిట్టల పాటల్నీ చెట్లు చెప్పిన కథల్నీ
సంచీలో నింపుకొని

ప్రతిరోజూ సాయంత్రం సముద్రం అలలమీద తేలే
అశ్వనీ నక్షత్రం పాడినపాట అందంగా మెడకు చుట్టుకొని
ప్రతిరోజూ అర్ధరాత్రి గుండెమీద ఏకాంతంలో ఎర్రగా వెలిగే
నిజం వజ్రాన్ని ఉంగరంలో పొదిగి నా వ్రేలికి తొడుక్కొని
ఊరూరా పాటలు పాడుకుంటూ తిరుగుతూ యీ ఊరు వచ్చాను
ప్రభుత్వ భవనాలు పార్కులు మేడలు బార్లు కర్మాగారాలు
నల్లని పరదాలు కప్పుకొని బరువైన బీగాలు వేసుకొని
నాక్కనబడకుండా దాక్కున్నాయి
నన్ను రానివ్వకుండా మూసుకున్నాయి
కానీ, లోపల భయంకర సంతోష కోలాహలంతో
కవిగాయక వైతాళికి వందిమాగధ విటకట్వాశ్లేషంలో
తనకి తనే వెరచి తనకి తనే మరచి
తందనాలాడుతోంది.

ఎందుకిలా అడుగడుక్కీ పోలీసులు అధికారపు బాలీసులు
ఏమిటి నీవొంటిమీద నల్లనిమచ్చలు యీ తెచ్చి కోలునవ్వులు
ఓహోహో నగరశైలూషి సద్మసద్మ ఛద్మవేషి
ఏ పాపరహస్యం నిను పీడిస్తున్నది?
ఏ విలువలు ఏ వెలుగులు నిన్ను వదలిపోయినవి?
ఆనాటిరాత్రి జిందగీ కీ మతలబ్ తెలియక తికమకగా
ఇన్సాన్ కీ మంజిల్ ఏమిటో ఊహించలేక బాధగా
అర్ధనిమీల నయనంలో అశ్రువే స్వప్నమై జారగా
అలా అలా ఊరుచుట్టూ తిరుగుతూన్న నాకు హఠాత్తుగా
హుసేన్‌సాగర్‌లో తేలుతూన్న శవం కనపడింది
నా ఉంగరం మెరిసింది
"ఇది నగరం హత్యచేసి పారవేసిన ఆత్మ" అని పలికింది
బెదరే కన్నులతో చూసి చీకటిలో నగరం తలవంచుకొంది.

–1969

★ ★ ★

# మన సంస్కృతి

మన సంస్కృతి నశించిపోతూందన్న
మన పెద్దల విచారానికి
మనవాడు పిలకమాని క్రాపింగ్ పెట్టుకున్నాడనేది ఆధారం
మనగలిగినదీ
కాలానికి నిలబడ గలిగినదీ వద్దన్నా పోదు
మరణించిన అవ్వ నగలు
మన కాలేజీ అమ్మాయి ఎంత పోరినా పెట్టుకోదు
యుగయుగానికీ స్వభావం మారుతుంది
అగుపించని ప్రభావానికి లొంగుతుంది
అంతమాత్రాన మనని మనం చిన్నబుచ్చుకొన్నట్లు ఊహించకు
సంతత సమన్వయావిష్కృత వినూత్న వేషం ధరించడానికి జంకకు
మాధుర్యం, సౌందర్యం, కవితా
మాధ్వీక చషకంలో రంగరించి పంచిపెట్టిన
ప్రాచేతస కాళిదాస కవిసమ్రాట్టులనీ,
ఊహా వ్యూహోత్కర భేదనచణ
ఉపనిషదర్థ మహోదధినిహిత మహిత రత్నరాసుల్నీ
పోగొట్టుకునే బుద్ధిహీనుడెవరు?
ఎటొచ్చీ
విధవలకీ వ్యాకరణానికీ మనుశిక్షాస్మృతికీ గౌరవంలేదని
వీరికి లోపల దిగులు
వర్తమానావర్త ఝుంఝూవీచికలికి కాళ్ళు తేలిపోయే వీళ్ళేం చెప్పగలరు?
అందరూ లోకంలో శప్తులూ పాపులూ
మనం మాత్రం భగవదంశ సంభూతులమని వీరి నమ్మిక
సూర్యుడూ చంద్రుడూ దేవతలూ దేవుళ్ళూ
కేవలం వీరికే తమ వోటిచ్చినట్లు వీరి అహమిక
ఇది కూపస్థమండూకోపనిషత్తు
ఇది జాతికీ ప్రగతికీ కనబడని విపత్తు

మనవేషం, మనభాషా, మన సంస్కృతీ,
ఆదినుండీ, ద్రవిడ బర్బర యవన తురుష్క హూణులనుండీ,
ఇచ్చినదీ పుచ్చుకున్నదీ ఎంతైనా ఉన్నదనీ,
అయిదు ఖండాల మానవ సంస్కృతి
అఖండ వసుధైక రూపాన్ని ధరిస్తోందనీ,
భవిష్యత్ సింహద్వారం
తెరుస్తోందనీ,

గ్రహించలేరు పాపం వీరు
ఆలోచించలేని మంచివాళ్ళు
ఏ దేశ సంస్కృతి అయినా ఏనాడు కాదొక స్థిరబిందువు
నైక నదీనదాలు అదృశ్యంగా కలిసిన అంతస్సింధువు.

*–1965*

★ ★ ★

# ద్వైతం

నువ్వు మావూరొచ్చినప్పుడు
నేను మీ వూళ్ళో వున్నాను
నువ్వు మద్రాసులో దిగేవేళకి
నేను కలకత్తా రైలెక్కుతున్నాను
నువ్వు ఉత్తరధ్రువంలో విసిరిన అరోరా బొరియాలిస్‌వి
నేను దక్షిణధ్రువతీరాన నిలిచిన పెలికన్ పక్షిని
నీకూ నాకూ మధ్య ప్రేమ బద్ధవైరంలాంటిది
అది పరస్పర దూరీకృత సమర్థమైనది
నీ ఆదర్శాలూ ఆశయాలూ
నీలాగ నాజూగ్గా అందంగా ఉంటాయి
నువ్వు పాలమీగడల్లోంచి జాబిల్లి అడుగుమీదనుంచి
పువ్వుల పెదాలనుంచి నడిచి వచ్చావు
నాకు ఆదర్శాలు లేవు; ఆశయాల్ని నమ్మను
నేను మోటుగా, దిగులుగా ఉంటాను
నేను జీవితం ముళ్ళకంచెల మధ్య, బురదగుంటల మధ్య
నిజంకోసం పరిశోధిస్తూ ఉంటాను
నువ్వు తీరిగ్గా ప్రేమించి మేడమీద చెలికత్తెల మధ్య
విహరిస్తావు నిట్టూర్పులతో
నేను ప్రాకృతికమైన ఆకలినీ, పాశవికమైన కామాన్నీ
భరించలేక జుట్టు పీక్కుంటాను
నీకు సత్యం సత్పదార్థం, అర్థవంతం, సంతతప్రకాశం
నాకు నిజం భయంకరం, అర్థవిహీనం, అసంపూర్ణం
ఏ కేంద్రంలో మన మిద్దరం కలుసుకోవడం?
ఏ అక్షాంశరేఖమీద నిలిచి కౌగిలించుకోవడం?
ఓ ప్రత్యూషపవనలోల మందార లతాంతమా!
నేను ప్రదోష వేళా తమాల శాఖాగ్ర ఘూకాన్ని
అటు–ఆనంద సుధర్మవైపు నువ్వు వెళ్లు నక్షత్ర ధూళిని చల్లుతూ
ఇటు–కలల బూడిదరాసుల మీద కూలబడతా కన్నీళ్ళు చిమ్ముతూ – *1965*

★ ★ ★

# వెన్నెల

కార్తీక మాసపు రాత్రివేళ
కావాలనే మేలుకున్నాను
చల్లని తెల్లని వెన్నెల
అంతటా పడుతోంది
మెత్తని పుత్తడి వెన్నెల
భూమి వొంటిని హత్తుకుంది
శిశువులాంటి వెన్నెల
నవ వధువులాంటి, మధువులాంటి వెన్నెల
శిశిరానిలానికి చలించే
పొరల పొరల వెన్నెల
శరద్రధుని సౌధానికి కట్టిన
తెరల తెరల వెన్నెల
ఎంత శాంతంగా,
హాయిగా, ఆప్యాయంగా ఉందీ!
చచ్చిపోయిన మా అమ్మ
తిరిగొచ్చినట్టుంది
స్వర్గంలో ఎవరో సంగీతం
పాడుతున్నట్టుంది
స్వర్గంలో అచ్చరలు
జలక్రీడ లాడుతున్నట్లుంది
ఎంత నీరవ నిర్మల సౌందర్యం
నన్నావరించుకొంది?
ఏ చామీకర చషకంతో
నా పెదవుల కందిస్తున్నది!
ఈ రాత్రి నిద్రిత సర్వధాత్రిమీద
ఎవరు ఈ తళుకు తళుకు

కలల పుప్పొడిని వెదజల్లారు!
ఎవరీ మెరిసే ముఖమల్
జంఖానా పరచి వెళ్ళారు!
ఓహో! చంద్రకిత ధాత్రి
ఓహో! కోరకిత గాత్రి
ఓహో! శరద్రాత్రి!
వ్యధలతో బాధ్యతలతో
భయాలతో మహితమైన
నా మనస్సు కిప్పు
దూరట కలుగుతోంది.
ఈ వెన్నెల నా మనస్సులోకి
జారుతోంది
నా గుండె పగుళ్ళనుండి కారుతోంది
నా అంతరాంతర రంగస్థలాన
ఏకాకి నటుడినైన నన్ను
తన మైత్రీ మధుర భావంతో
క్రమ్ముకుంటోంది
నా లోపలి లోపలి గుప్త
వీణా తంత్రీ నివహాన్ని
వేపథు మృదు లాంగులుల
తాకి పలికిస్తోంది.
నన్ను బతికిస్తోంది
నా బతుక్కి అందాన్నీ
అర్థాన్నీ ఆశనీ
రచిస్తోంది.

నా రచనగా తానైపోయింది
వెన్నెలవంటి నా ఉద్రేకానికి
తెలుగు భాష శరద్విీయ
ద్విహార వనమై నడిచిపోయింది
చలిచలిగా సరదాగా ఉంది వెన్నెల
చెలి తొలిరాత్రి సిగ్గులా వుంది

విరిసిన చేమంతి పువ్వులా ఉంది
పడకగదిలో వెలిగించిన
అగరొత్తుల వాసనలా ఉంది
పడగిప్పిన పాములు తిరిగే
పండిన మొగలి వనంలాగుంది
పన్నీరు జల్లినట్టు ఉంది
విరహిణి కన్నీరులా ఉంది
విరజాజుల తావితో కలిసి
గమ్మత్తుగా ఉంది
విచిత్రమైన మోహమణి
కవాటాలను తెరుస్తోంది
యౌవన వనంలోని కేళీ సరస్సులా ఉంది
దవుదవ్వుల పడుచు పిల్లలు
పకపక నవ్వినట్టుంది
దాపరికంలేని కొండజాతి
నాతి వలపులాగుంది
ఇది సృష్టి సౌందర్యాను
భూతికి టీక
ఇది తరుణ శృంగార
జీవన పేలకు ప్రతీక
చిందెను తెల్లని చల్లని వెన్నెల
చలిరాత్రుల మౌనపు
గానపు తెమ్మెల
జారెను తోటల
కొబ్బరి మొవ్వల
ఇంటిముందు బోగన్‌విల్లా పువ్వుల
ధనికుల కిటికీ పరదా చిరుసందుల
సురతాలస నిద్రిత సతి కపోలమ్ముల
జారిన జార్జెట్ చీర జిలుగుటంచుల
చిందెను తెల్లని చల్లని వెన్నెల
చలిరాత్రుల మౌనపు గానపు తెమ్మెల
నిరుపేదల కలలో

కదలిన తీయని ఊహల
ఊరిప్రక్క కాలువ అద్దపు
        రొమ్ముల
ఊరి బయట కాలీకాలని
        చితి కీలల
అడవిలోన వికసించిన
        ఒంటరి పువ్వుల
చిందెను తెల్లని చల్లని వెన్నెల
చలిరాత్రుల మౌనపు గానపు తెన్నుల

*–1964*

★ ★ ★

# హార్లెమ్స్‌లో శవం

అమెరికాలో ఆ రోజున చరిత్ర భంగపడి ఏడ్చింది
అంత ఎత్తు భవనాల మీద నుండి తొంగిచూచిన ఆదిత్యుడికి
హార్లెమ్స్‌లో జేమ్స్ పోవెల్ శవం కనబడింది
అవనీతలంమీద అకాలపు చీకటి పడింది
పదహారేళ్ళ పిల్లవాడు నల్లవాడు నీగ్రో కుర్రవాడు
ఆడుతూ పాడుతూ ఆశల కాంక్షల తోటల దోరగ పండిన కాయల్ని
అటుయిటు చూస్తూ బెదురుగా బెరుగ్గా కోసుకొనబోయేవాడు
తన రంగు నలుపైనందుకు తన అభిమానాన్ని చంపుకోనందుకు
తన పౌరుషం చూపించినందుకు తనూ మనిషేనని నిలబడినందుకు
వర్గం వర్గం కలసి అహంకృతితో ఎక్కుపెట్టిన తుపాకి దెబ్బకు
ఆహుతైనప్పుడు

సన్నగా చారకట్టిన రుధిరం నీ కళ్ళలోకి ప్రాకినపుడు
నీ కలలో ఎర్రని సముద్రాలు పొంగినప్పుడు
నల్లని పర్వతాలు కూలినపుడు
నీ అడుగులక్రింద కపాలాలు వికృతంగా నవ్వినపుడు
నిన్నరాత్రి నీ గుమ్మం ముందు నిలబడి పిలిచిందెవరని, పోవెల్ శవం
నా గది కిటికీ ఊచల నానుకుని దీనంగా చూసినది పోవెల్ శవం
ప్రతి దారి మలుపులో నిలదీసి అడిగినది పోవెల్ శవం
ప్రతి గుండెలో గిజగిజలాడి కొట్టుకున్నది పోవెల్ శవం
బ్రతికిన పోవెల్ భాష తెలియనివాడా, చచ్చినవాని శవం పలకరిస్తే
వినలేవా?

అయ్యో సూర్యనారాయణా, అబ్దుల్ ఖాదర్, మిస్టర్ విలియమ్స్,
మూ – విన్, క్లోజర్ నెక్రోవ్! దేశదేశాల మనుష్యుల్లారా?
చచ్చిన పోవెల్ మీ తమ్ముడు, మీ మేనల్లుడు, మీ లోపలి మానవుడు

నీడలమధ్య పాముంది అడవులమధ్య పులివుంది జాగ్రత్తగా చూచినడు
ప్రతి ఒకడూ దీనికి బాధ్యుడు - చరిత్ర పగనెవడూ తప్పించుకుపోలేడు

(హార్లెం స్క్వేర్ నీగ్రోల కాటపట్టు. పోవెల తన విద్యార్థి మిత్రులతో కాలక్షేపం చేస్తుండగా ఒక తెల్లదొర అవమానించాడు. అదేమని ఎదిరించిన పోవెల్ని దారుణంగా కాల్చి చంపేశాడు.

పోవెల్ అంత్యక్రియలు దుఃఖిత క్షుభిత నీగ్రో సమాజం కన్నీళ్ళతో నిశ్శబ్దంగా వీక్షించింది. వారి హృదయంలో ఏ ప్రతీకారానలం చెలరేగింది. ఏ స్వాతంత్ర్య దీక్షా కిరణం ప్రకాశించింది. ఆ సమయాన...)

# శవం

ఈ శవం చాలా దుర్మార్గపు శవంలా ఉంది
ఇది సరిగ్గా యుద్ధ విరమణ రేఖ మీద వచ్చింది
మనందరికీ చచ్చే చావు వచ్చింది
మంచులో నాని నాని మాడి మాడి రూపం పోయింది.
మంచులో తడిసిన యూనిఫారమ్‌ని
నక్కలు ముక్కలు చేశాయి
మరెవ్వరి దీ

సొల్జరు శవం
డెమోక్రసీదా? సోషలిస్టు కేంపుదా?
ఇంపీరియలిస్టుదా?
వీడి పెళ్ళాంకి వీడి ఆనమాలు తెలుస్తుంది
వీడి పెళ్ళామెవరో ఎలా తెలుస్తుంది?
వీణ్ణి ఏ సైనిక గౌరవాలతో, ఏ దేశ నినాదాలతో
తగలెయ్యాలో, పాతి పెట్టాలో ఎలా తెలుస్తుంది?

ఒకటే మార్గం ఉంది
అన్ని దేశాలలో ఏడుస్తూన్న
కొత్త కొత్త విధవల్ని తీసుకురండి
ఐడెంటిఫికేషన్ పెరేడ్ పెట్టిస్తాను
యు యన్ ఓ పీస్ కమిషన్ ఛైర్మన్‌గారూ!
భయపడకండి!

ఇదేం కష్టం కాదు వినండి
ఇదంతా తద్విధవల కన్నీటితో తడై బురదై
పోతుందని భయపడకండి!
నెత్తురు వరదల్ని చూసిన మనకి
కన్నీటి వాన లెక్కా జమా?

బాల్చీలు సిద్ధం చేయిస్తాను నేను
విధవల్ని వరుసలో నిలబెట్టండి మీరు!
ఒకవేళ వీడొక పెళ్ళికాని
బ్రహ్మచారైతే ఎలాగ?
చచ్చాంరా బాబూ!

*–1954*

★ ★ ★

# వెళ్ళిపొండి, వెళ్ళిపొండి

ఎవరు మీరంతా ఎందుకిలా వొంగిన నడుంతో కన్నీటితో
చెదిరిన జుట్టుతో జారిన పైటలతో
ఈ సమాధులచుట్టూ వెతుక్కుంటూ తిరుగుతారు
తల్లులా భార్యలా అక్కచెల్లెండ్రా మీరు
ఏనాటివారు ఏ వీటివారు మీరు
ఏ యుద్ధంలో చనిపోయాడు మీవాడు ఏ దళం ఎన్నవ నంబరు

కురుక్షేత్రమయితే కృష్ణుణ్ణి అడుగు
పానిపట్టయితే పీష్వాల నడుగు
బొబ్బిలయితే బుస్సీ నడుగు
క్రిమియా యుద్ధం కొరియా యుద్ధం
ప్రథమ ద్వితీయ ప్రపంచ యుద్ధాలు
బిస్మార్క్ నడుగు హిట్లర్ నడుగు
బ్రహ్మదేవుణ్ణి అడుగు

అయ్యయ్యో అలా చూడకండి ఎండిన కళ్ళతో బిగించిన పళ్ళతో
ఏడుపింకిపోయిన ఎడారి రొమ్ముల్ని చూపించకండి
ఏం చెప్పను మీకు ఎవరు జవాబుదారీ అని చెప్పను

చీకటి పడేవేళ
చిరుత పులులు పశువుల్ని నోటకరుచుకుని పోయేవేళ
పాడు బావిలోకి పడుచు విధవలు దూకేవేళ
చచ్చిన చరిత్ర బొమికలకోసం కుక్కలు కొట్లాడుకునే వేళ
దెయ్యపు మర్రిచెట్టుమీద దీనంగా అరుస్తూ పిట్టలు కళ్ళు తేలవేసే వేళ
ఏదో భయం భయం
చుట్టూ నురగ విషం
ఉరగ విషం
మృషా విషం

బాధా విషం
దుఃఖ విషం
పొర్లి పొర్లి పొంగి పొంగి వస్తున్నది
అమ్మా వెళ్ళండమ్మా
ఎందుకిలా వొంగి వొంగి కుంగి కుంగి
ఈ సమాధుల చుట్టూ వెతుక్కుంటూ తిరుగుతారు
శవాలు మాట్లాడవు
సమాధులు చూపించవు
మృత్తిక గుర్తించదు
మిత్తికి దయవుండదు
మీ రోదన మీలోనే అణుచుకుని
మీ కళ్ళను మీరే పొడుచుకుని
ఇలాగ యిలాగ యీ పాముల పుట్లమ్మట
ఈ మొండి చెట్లమ్మట యీ కూలిన గట్లమ్మట
వెళ్లిపొండి వెళ్లిపొండి వెళ్ళిపొండి

*–1966*

★ ★ ★

# కాస్మాపాలిటన్

రష్యాలో 'రివిజనిస్టు'* వోడ్కా సిప్ చేసి
చైనాలో 'రివల్యూషనిస్టు' సప్పర్ భోంచేసి
అమెరికా హాలీవుడ్ తారాపథాలమీద చక్కర్ కొట్టి
టోక్యోలో గైషా యోషాధరాల టేస్టుచేసి
స్పెయిన్‌లో రెయిన్‌లో తడిసి
ఇరాన్‌లో కొరాన్ చదివి
ఈ రోజునే ఇండియా వచ్చేశారు వీరు
కాస్మాపాలిటన్ బోర్ వీరి మారు పేరు

శంకరుడూ సాంఖ్యాయనుడూ వీరి ఫింగర్ టిప్సుమీద
కారల్ మార్క్సూ కిర్క్‌గార్డూ వీరి హృదయాంతరాళంలో
బీటిల్సూ బీట్నిక్సూ వీరి జిహ్వాగ్రంమీద

ఆరెంజ్ ఫ్రీస్టేట్‌లో వీరు ఉపన్యసించారు
అరిజోనాలో సత్యాగ్రహం చేశారు.
వన్ వరల్డురాస్తూ వెండెల్ విల్కీ వీరిని సంప్రదించారు
ఆస్ట్రేలియన్ ఎబోరిజన్సుమీదా నెసెసిటీ ఆఫ్ ఎబోర్షన్సుమీదా
కలిపి ఒకే ఒక ఉద్గ్రంథం రచించారు
గాంధీకీ గాడ్సేకీ దాన్ని అంకితం ఇచ్చారు.

మొదటి భార్య నీయన వదిలేశాడు
రెండో ఆవిడ యీాయన్ని తగిలేసింది
మూడో పెళ్ళాంకోసం మొనాకో పేపర్లలో ప్రకటించారు.
ఫ్లీట్ స్ట్రీట్‌లో బాండ్‌స్ట్రీట్‌లో వీరి మాట వేదవాక్కు
స్ట్రిప్టీజ్‌లో ఫస్టు షోలో ఫస్టుసీటు వీరికి జన్మహక్కు
పారిస్‌లో కవితనీ షాంపేన్‌నీ కలిపి సేవించారు

---

రష్యాలో కమ్యూనిస్టులను 'రివిజనిస్టు' అనీ, చైనాలోని నేటి పిడివాదులను 'రివల్యూషనిస్టు'లని అనడం కుహనా మార్క్సిస్టుల ఫాషన్ – ప్రచురణ కర్తలు.

ఫ్లారెన్స్‌లో యువతినీ ప్రకృతినీ కలిపి అనుభవించారు
ఫ్రీలాన్స్ జర్నలిస్టు, వార్ కరస్పాండెంట్, వెంట్రిలోక్విస్టు
వీరు చూడని దేశం లేదు, పొందని అనుభవం లేదు.

అణుధూమం వంటి వీరి జీనియస్ భవిష్యత్తులో
అరవై శతాబ్దాల మీదికి కమ్ముకుంది
సకల సిద్ధాంతాలు మతాలూ యిజాలూ సైంటిఫిక్ నిజాలూ
అన్నీ కలబోసి రంగరించి ఒకే ఒక రహస్యం కనుక్కున్నారు
దాన్నే తన మరణానంతరం 'ఎపిటాఫ్'గా ఎన్నుకున్నారు
"దేవుడూ మానవుడూ వీరిద్దరే యీ అనంత విశ్వంలో మూర్ఖులు
ఏ కోణం నుంచి చూచినా వీరిద్దరూ మిజరబుల్ ఫెయిల్యూర్స్"

*–1966*

★ ★ ★

# త్రిమూర్తులు

ఒకడు
మా వాడే - మహాగట్టివాడు - మకుటంలేని మహారాజయ్యేవాడు
కాని ముసలిదాన్ని, మసక మసక కన్నులదాన్ని,
మూల మూల ముడుచుకు కూర్చున్న దాన్ని
మనువు చేసుకోవాలన్న ఉబలాటంతో
మంచీ చెడ్డా మరచిపోయాడు
మర్యాదల్ని అతిక్రమించాడు
మరి పనికిరాడు

మరొకడు
మల్లెపూలమీద పరుంటాడు, మంచిగంధం రాసుకుంటాడు
మరి ఎందు కేడుస్తాడు?
మంచి పనివాడు, మాకు నచ్చినవాడు, మంత్రనగరానికి
వెళ్ళొచ్చినవాడు

మాతోపాటు నడుస్తానంటాడు
మరి నిజంగా వస్తాడా?

మూడోవాడు
అరె! వీడు చిచ్చర పిడుగు, ఎండలో నడిచే మనుష్యులకి గొడుగు
ముందుకు వేసిన అడుగు
మాకు చిన్నన్న కానీ అన్నన్న! ఈ మధ్య విదేశాల చవకబారు
పానీయాలు సేవించి
మత్తుగా పడుకున్నాడు
మరి యిప్పట్లో లేవడు.

*–1966*

★ ★ ★

# త్రిమూర్తులు
## (పాఠాంతరం)

ఒకడు
మా వాడే
మహాగట్టివాడు
మకుటంలేని మహారాజయ్యేవాడు
కాని ముసలిదాన్ని
మూలకూర్చున్న దాన్ని
మసక మసక కన్నులదాన్ని
మనుధర్మ శాస్త్రప్పందిరిలో
మనువాదాలన్న తొందరలో
మంచీ చెడ్డా మరచిపోయాడు
మర్యాదలతిక్రమించాడు
మరి పనికిరాడు.

మరొహాడు
మల్లెపూలమీద పరుంటాడు
మంచి గంధం రాసుకుంటాడు
మరి ఎందుకేడుస్తాడు?
మంచి పనివాడు
మాకు నచ్చినవాడు
మంత్రనగరానికి వెళ్ళొచ్చినవాడు
మధ్య మధ్య మాధ్వరసం చేదంటాడు
వధ్యశిల మీద విరహగీతం రాస్తాడు
మాతోపాటు నడుస్తానంటాడు
మరి నిజంగా వస్తాడా?
మారిపోయిన జగాన్ని చూస్తాడా?

మూడోవాడు
అరె! వీడు చిచ్చుర పిడుగు
ముందుకు వేసిన అడుగు
ఎండలో నడిచే మనుషులకి గొడుగు
మాకు చిన్నన్న!
కానీ అన్నన్న
(మరి చెవులో చెపుతాను వినండి)
యీ మధ్య విజాతీయ మద్య
పానీయాలు సేవనా విద్యా
సద్యః ప్రాప్త భావశూన్యుడై
మత్తుగా పరుండి నిద్రపోయాడు
మరి యిప్పట్లో లేవడు.

(ఈ ముప్పురూ తెలుగు సాహిత్య లోకానికి చెందినవారు – వీరెవరో చెప్పుకోండి.)

(ఆంధ్రప్రభ వారపత్రిక, 1966)

☆ ☆ ☆

శ్రీ శ్రీ

అతని శైలి శైలూషి
ప్రజా శ్రేయోభిలాషి

కృష్ణశాస్త్రి

ఒక స్వప్నం ఒక బాష్పం
మెదిపిన సుగంధ ద్రవ్యం

విశ్వనాథ

విశ్వనాథ వైశ్వానర
కీలార్చికి వాగీశ్వరి
సగం మెరిసె సగం వడలె –1966

★ ★ ★

# చిన్నారికి చిన్నమాట

జీవితం సంగీతం పెట్టె మీద
చిగురుటాకు అంగుళులను కదలనీ
పలుకుతుంది హిందోళ
ఒలుకుతుంది నవహేల
అప్పుడు
బ్రతుకే ఊగే ముత్యాల ఉయ్యాల

జీవితం నవనీతం పాత్రమీద
చెదరిపడనీకు రాయినీ రప్పనీ
పగులుతుంది స్వప్నం
రగులుతుంది దుఃఖం
అందుకే
బ్రతుకే ఉలిపిరి కాగితం చందం

జీవితం దేవతల దరస్మితం
చిన్నారీ! పెదవిమీద సింగారించు
కలతవద్దు కొలతవద్దు
అలసట అలజడివద్దు బాల!
అప్పుడు
బ్రతుకే లలిత లలిత లతాంతమాల.

★ ★ ★

# మంచు

హలో హలో.... నేనండి నేను... నేన్నేను
డాక్టర్ గారున్నారా.....అర్జంటు సార్ వెరీ అర్జంట్!
మావాడు బిగుసుకుపోతున్నాడండీ --- ప్రమాదం
మంచుపడి చల్లబడి నల్లబడి చచ్చిపోతున్నాడండి
హలో హలో
హయ్యో హయ్యో
అయ్యో అయ్యో
ఒకసారి రండి రక్షించండి దయుంచండి
మంచున్న పళాన రండి
ఏఁవిటి పడిం దంటారా
ఇంకా ఏఁవిటంటారేఁవిటండీ
చీకటిపడింది జీవితఘటానికి చిల్లుపడింది
బ్రతుకు అంచుమీద నల్లని దుఃఖపు కెరటం విరుచుకుపడింది

అయ్యో డాక్టరుగారూ
అబ్బో డాక్టరుగారూ
మావాడు మావాడు కాకుండా మారిపోతున్నాడండి
మానుంచి మంచిరోజులనుంచి జారిపోతున్నాడండి
భయపడి భయంకర శిఖరాలమీదనుంచి దూకుతున్నాడండి
ఇంకేదిదారి దేవుడా ఇదెలా భరించగలం దేవుడా
అయ్యయ్యో డాక్టరుగారూ
ఏఁవండీ డాక్టరుగారూ
రెండు ప్రపంచయుద్ధాల మంటలమధ్య
చర్మం కాలిపోతూ స్వప్నం రాలిపోతూ
నడచివచ్చాడు
చచ్చిపోయిన వేలాది సైనికుల మధ్య
తన శవాన్ని చూసి ఉలిక్కిపడి జబ్బుపడ్డాడు

అడుగడుక్కీ యిజాల గోతుల్లోపడి
వొళ్ళంతా కొట్టుకుపోయి బేజారెత్తిపోయాడు.

మొన్న ఎన్నికల్లో తిరిగి తిరిగి అభ్యర్థు లిద్దరిలో
ఎవడెక్కువ నీచుడో తెలుసుకోలేక
పిచ్చెక్కి జుట్టు పీక్కున్నాడు
వాళ్ళమ్మ వొంటి ముడతల్లో తండ్రి దౌర్జన్య శాసనలిపిని
చదివి జాలిపడి ఏడ్చాడు
తన సంపాదనకీ పెళ్ళాం ప్రేమకీ గల రేషియో గుర్తించి
స్తంభించి పోయాడు
చర్చిముందు గుడిముందు మసీదుముందు
చచ్చి గుట్టలుగా పడివున్న సత్యాన్ని చూసి తెల్లబోయాడు
ఆచరణల నట్టడవిలో వేటాడి చంపిన
ఆదర్శపు చుక్కల అందమైన జింకల్ని
చూసి ఘొల్లుమన్నాడు
ఇంగెర్సాల్‌నీ షానీ మార్క్సునీ చలాన్నీ
ఇంకా పనికిమాలిన వాళ్ళందర్నీ చదివి
బొత్తిగా పాడై పోయాడు
హార్టాపరేషన్ చెయ్యమంటూ
ఆస్పత్రులచుట్టూ తిరుగుతున్నాడు
మాఫలేషు కదాచన
పరిత్రాణాయ సాధూనాం
Lead Kindly Light
లాంటి మాటలు విన్నప్పుడల్లా
"బాబోయ్ మోసం!" అని అరుస్తున్నాడు
నీతుల రగ్గులు కప్పుతున్నా చలి ఆగడం లేదు
సూక్తుల కంబళ్లు పరుస్తున్నా వణుకు తగ్గడం లేదు.
ఆదర్శాల పందిళ్లు కప్పుతున్నా మంచు కురవడం మానడం లేదు
సంప్రదాయాల కుంపట్లు రాజుకుంటున్నా వేడెక్కడం లేదు
అయ్యో డాక్టరుగారూ చూపు సరిగా ఆనడంలేదు
ప్రతి ఒక్కడిలో యిద్దరు ముగ్గురు మనుషులున్నారంటాడు
చీలిపోయిన మనుషులు శీలవంతులైన మనుషులు
చీనానుంచి చిలీదాకా

చెదరి కొట్టుకు పోతూన్న బతుకులు
బతుకుల చితుకులు, చితుకుల మంటలు
సురిగిన గంటలు....అందర్నీ రమ్మంటాడు
ఆర్పమంటాడు – ఫైరింజన్లకి ఫోన్ చేస్తాడు
అయ్యో డాక్టరుగారూ
అరెరే డాక్టరుగారూ
హఠాత్తుగా సంధికూడా వచ్చిందండీ
ఏదో ఏదో వాగుతున్నాడు అర్థంలేని పేలాపన
వ్యాకరణం లేదు వాక్యనిర్మాణం లేదు
సంధి విసంధి నియామాల్లేవు
చక్కని ఉపమాద్యలంకారాల్లేవు
సభ్యతలేదు, బజారుభాష వాడేస్తున్నాడు
సత్యాన్ని సభలో పెట్టి వలువలు వొలుస్తానంటాడు
సీక్రెట్ అని రాసిన గదులన్నీ తెరుస్తానంటాడు
చూరులో దెయ్యాలున్నాయి
మంత్రం చదివి సీసాలోకి పట్టమంటాడు
వణికిపోతున్నాడు
వాలిపోతున్నాడు
మంచులో కప్పుకుపోతున్నాడు
మంచులో కూరుకుపోతున్నాడు
మాయ మంచు అనుమానం మంచు
అవిధేయత మంచు మూగబాధవంటి మంచు
మూలుగుతూన్న మంచు ముసిరి ప్రాణమూలాన్ని తాకి
చల్లారిస్తున్న మంచు
డాక్టరుగారూ
డాక్టరుగారూ
రండి రండి వేగిరం రండి సార్!
హలో హలో ....హలో డాక్టర్!

## 2

ఆల్ప్సు పర్వతశ్రేణిపైన హిమవన్నగ పంక్తులపైన
సైబీరియాలో సియెర్రా నెవడాలో
అంటార్కిటిక్ సముద్రంమీద ఆస్ట్రేలియన్ స్టెప్పీలమీద
కురుస్తోంది మంచు

దారి కనపడక
కొండ తగిలి పేలిందొక విమానం
మంచు పడిన దారుల్లో
మంచి వంటి వెలుతురు లేక
జారి జారి అగాధాల్లో
కూరుకు పోతున్నారు
అణ్వాస్త్రభయం వంటి మంచు
నియంతల నిర్దయలాంటి మంచు
నీకూ నాకూ మధ్య నిజాన్ని దాచిన మంచు
మనిషికీ మనిషికీ మధ్య మమతను కప్పిన మంచు
కాళిదాసు శ్లోకం, బీథోవెన్ సోనెటా
లియొనార్డో చిత్రం, లేపాక్షి శిల్పం
సూచించిన సౌందర్యలోకాల నాహరించి
ఏసుక్రీస్తు తథాగతుడు ఏతన్మధురోహల నధఃకరించి
గతం భవితవ్యం కనిపించనివ్వని
ప్రగాఢ జడిమ యీ హిమభ్రమ
అనాదిగా అవిరళంగా కురుస్తోంది
అర్కవిద్రోహబుద్ధితో మంచు
అడుగడుగునా మానవ మహీయఃప్రభుత్వాన్ని
గరీయఃప్రతిభని అడుగుకి త్రొక్కి
ఓడించాలని మించుకోవాలని
క్రమ్ముకుంటోంది మంచు
అనాది నుండి చీకటితో చెయ్యికలిపి
పగటి వెలుగుతో బాంధవ్యం నటించి
సాబటేజ్ చేస్తోంది మంచు
అలసటని సుఖంగా అనాలోచనని సమాధ్యవస్థగా
కెమాఫ్లేజ్ చేస్తోంది మంచు
సంకల్పం ప్రభవించే అంగారస్థానంలోనే
స్థావరం ఏర్పరచుకుని
గర్భస్రావం కలిగిస్తోంది మంచు
సత్యం శివం సుందరం త్రిమూర్త్యాత్మకమైన
శ్రీమదా ధర్మదేవీ సాక్షాత్కారాన్ని నిరోధించి
ఆముష్మికపు ఆశతో
సంప్రదాయ చ్ఛలంతో స్వర్గ నరకభయంతో

ఆలోచనా సాహస వైహాయస వీధుల నావరించి
జీవన వనంలో ఆకుల్ని పువ్వుల్ని రాల్చి జీదృక్షను కూర్చి
చలితో వణకించి పొగతో వంచించి ధరాతలాన్ని
ముంచెత్తి కురుస్తోందీ మంచు

# 3

హల్లో డాక్టరుగారూ
అయ్యో డాక్టరుగారూ
చుంచుకాదు సార్...మంచు మంచు
స్నో, ఫాగ్ - సైలెంట్ స్నో -
డ్రెడ్‌ఫుల్ స్నో...ఎడ్గార్‌స్నో
నిరాశ మంచు నిస్పృహ మంచు
నీ మీదా నా మీదా అందరి మీదా
నమ్మకంపోయిన సినికల్ మంచు
వాడి తలమీద వాడి వొంటిమీద వాడి కడుపులో వాడి గుండెల్లో
అబ్బ వర్షంకింద కుంభినీ పాతంకింద
కురుస్తోంది
కురుస్తోంది
కోస్తోంది
కత్తి అంచులాంటి మంచు
కరకు మంచు మెరుపు మంచు
అయ్యా డాక్టరుగారూ రావాలి గబగబ రావాలి
అదిగో మళ్ళీ మైకంలో పడిపోతున్నాడు
మంచుకి కొంకర్లు పోతున్నాడు
మనకి కాకుండా మరో జీవితంలోకి
చచ్చిపోతున్నాడు
బజారు మనిషిలా మాటాడేస్తున్నాడు
ఇజాల నుండి కాపాడతానంటాడు
నిజాల కైజారుతో దొంగ బ్రతుకుల్ని పొడిచి
పచ్చినెత్తురులో నూతన సంగీతం పలికిస్తానంటాడు
అయ్యా డాక్టరుగారూ
ఇది తప్పకుండా సంధి పేలాపన
కాదంటే ఉన్మాదం - ఇది వాడికీ మనకీ ప్రమాదం
నిఖరమైన నెత్తుటిలో సంగీతం పలికిస్తానంటాడు

అయ్యో డాక్టర్‌గారూ రావాలి గబగబా రావాలి
ఇది తప్పకుండా సంధి పేలాపన
ఇది మన సుఖ భద్రతల కుద్వాసన
ఇది క్లుప్తసారము అపస్మారము కృత్త చేతనము
హలో డాక్టరుగారూ
అయ్యో డాక్టరుగారూ
అయ్యయ్యో డాక్టరుగారూ – రండి రండి!
అతని కనురెప్పలమీద పడింది మంచు
సనాతనా
కాస్మిక్ కిరణాల నిటువైపు ప్రసరించు
అతని గుండెనంతా కప్పింది మంచు
అధునాతనా
కరుణామసృణారుణ కవిత వినిపించు
అతని బ్రతుకుమీద పరచుకొంది మంచు
అనూన విజ్ఞానధనా
కాలసంకీర్ణ సౌవర్ణ చరణ మంజీరాల రవళించు
ఇది తెల్లని చీకటి
ఇది మృత్యువు విసరిన చల్లని దుప్పటి
ఇది మంచు
ఇది మంచుకప్పిన బాట
ఇది మంచులో యిరుక్కున్న పాట
కనిపించదు కోట
ఇపుడు నరాలు జివ్వుమని తెగెను
ఇది మనిషి వాంఛలు కెవ్వుమని సురిగెను
ఇది వ్యాధి సుమా సమాధి సుమా
ఇది దృశ్యాదృశ్య విభ్రమచణము హిమము
ఇది విచిత్ర తమము ధవళవిష్టార్ణవ ఫేనము!
ఇది జడీభూత మనస్సుమము
ఇది నిస్స్పృహోచ్ఛలిత శూన్యజీవన గగనము
ఇది అంచు తెలియని భావి కనిపించని బావి
ఇది జడిమ
ఇది రెండుకొండల నడిమి
ఇది మానవుడి ఓటమి

ఇది మంచు
ఇది మంచు

## 4

ఏఁవండీ యిలా వొదిలేసి వొంటరిగా నన్నూ పిల్లల్నీ
యెక్కడికి చీకట్లో వెళ్ళిపోతున్నారు
యిలాగ మంచులో పడిపోతున్నారు?
ఇక్కడ మమ్మల్ని భయంతో కట్టేసి
బాధతో పొడిచేసి
అరవకుండా ఆకల్ని నోట్లో కుక్కేసి
అయ్యయ్యో ముండకోసం జూదంకోసం తాగుడుకోసం
అర్ధరాత్రి వెళ్ళిపోతున్నారు
దేవుడా ఆడదాన్ని అసహాయని ఆరోసారి గర్భిణిని
నా కన్నీళ్ళు చూడవా
నా మొరాలకించవా
కట్టుకున్న వెధవకి కాస్తయినా జాలిలేదురా దేవుడా
వాణ్ణి శిక్షించేవారు లేరా
నన్ను రక్షించేవారు రారా
ఆవిడిగోల గుమ్మం దాటకుండా అడ్డుకుంది మంచు
అతని చెవిని పడకుండా ధ్వనిని ఆవర్తించింది మంచు
అతని పాపం బట్టబయలు పడకుండా చుట్టూ కప్పింది మంచు
అసహాయంగా చూస్తూ నక్షత్రం, ఆకాశంమీద గిలగిల్లాడింది.

## 5

హలో హలో
అయ్యో డాక్టరుగారూ, నేనండీ...నేన్నేను
మావాడు బిగుసుకుపోతున్నాడండీ ప్రమాదం
ఆదర్శవాది అర్ధరాత్రి బురఖాతీసి
అద్దంలో నగ్నంగా ప్రతిఫలించడం చూశాడు
అమ్మాయిల కన్నుల్లో సరదాకీ సభ్యతకీ
మధ్య జరుగుతూన్న యుద్ధాన్ని చూశాడు
మావాడు మంచివాడండీ

మావాడు చచ్చిపోతున్నాడండీ
హయ్యో హయ్యో
మంచుపడి చల్లపడి నల్లపడి
చచ్చిపోతున్నాడండీ
ఒక్కసారి రండి రక్షించండి దయుంచండి
నుంచున్న పళాన రండి
హలో హలో....అయ్యో అయ్యో!

–1966

★ ★ ★

# శిఖరారోహణ

లైట్లు వెలిగిన స్టేషన్‌లోకి రైలు వచ్చినట్టుగా
కొత్త సంవత్సరం హుషారుగా కొత్తగా రావాలి మన మధ్యకి
కాని యీసారి ప్లాట్‌ఫారమంతా చీకటిగా వుంది
పాత మాటల మూటలతో కవులూ
వట్టి మాటల సంచులతో రాజకీయవేత్తలూ
మొహమాటం లేకుండా ముందెక్కి కూర్చున్నారు
రైలింగ్ అవతల టిక్కెట్లు దొరక్క ప్రజలు దిగాలుపడి నుంచున్నారు
రేపటి ఉదయానికి వేసిన పట్టాల్ని ఎవరో తొలగించి వేశారు.

*　　　　*　　　　*

ఇక్షుకోదండ జ్యావల్లి నాస్ఫాలించబోయి
చటుక్కున ఎందుకో మన్మథుడు వెనక్కి అడుగువేశాడు
ఆమ్రశాఖాగ్ర వుంస్కోకిల సమ్మె ప్రకటించింది
పల్లవం ముట్టదు గొంతుక విప్పదు
అన్యోన్యానురక్తులైన యువతీ యువకు లొక్కసారిగ
హులాహుప్ ట్విస్ట్ లావేసి అసమ్మతి ప్రకటించారు
వాసంత సమీరం వస్తూ వస్తూ
ఊరి శివారున తుమ్మల తోపుల్లో స్తంభించిపోయింది
మాధవ దేవునికి మర్యాద లెవరు చేస్తారు
సాహస చందనం ఎవరు పూస్తారు
సౌందర్య నేపథ్య మెవరు కై సేస్తారు
జీవనవనంలో నవనవ సురభిళరమ్యం యౌవనసుమం ఎవరు పూయిస్తారు?

*　　　　*　　　　*

ఘమ్మం తగిలి తలమీద బొప్పికట్టినా గొప్పకి నవ్విన
కొత్తకోడలులూ వచ్చి నిలుచుంది కొత్త సంవత్సరం

బెదురుగా దిగులుగా ఎబ్బెట్టుగా నిలుచుంది కొత్త సంవత్సరం
జడుసుకున్న పిరికివాడు మగడు
జాలిలేని గయ్యాళి అత్త
తన పూర్వపు హోదాని నెమరేస్తూ బతికే మామగారు
ఇంటి చూరుపట్టుకు వేలాడే ప్రేతాత్మలు గబ్బిలాలు
ఇంటివెనుక పాడుబావిలో మొలిచిన పిచ్చి మొక్కలు
ఇదే సమయం అని వీధిలో నిలిచి కన్ను గీటే మొనగాళ్ళు
ఇదీ కథ ఎలా రక్తికట్టిస్తావు రసం పుట్టిస్తావు
ఈ వడగాలిలో హోరులో ఏ రాగం వినిపిస్తావు....

* * *

మనస్సెపుడో మొద్దుబారి మనుగడ పడికట్ల మరమేకుల్లో దిగబడి
మూల్గిమూల్గి మూల్గునే సంగీతం అని మురిసిపోతోంది
ఎవరూ చూడడంలేదు క్షితిజరేఖ వెనుక నిలిచి పిలిచే రత్న కంకణ
హస్తాన్ని

ఎవరూ వినడంలేదు నిద్రకీ మెలుకవకీ మధ్య ఒక క్షణం మ్రోగిన
జంత్ర సంగీతాన్ని

అపుడు నేను కాలతీరాన ఒకణ్ణే నడుస్తున్నాను
చరిత్ర విచిత్ర సముద్రాలవలోకిస్తూ
అవి విసిరిన తుంపర్లలో తడుస్తూ

అవును నామీదికి భవిష్యద్గగనం వంగి, నా
చెవిలో చెప్పిన రహస్యం విన్నాను
చెదిరిన మబ్బుల మధ్య సూర్యుణ్ణి చూశాను

అపుడు నేను ఈజిప్టు పిరమిడ్ల మధ్య బాబిలోనియా స్థూపాలమధ్య
మొహంజొదారో శిథిలాల మధ్య నిలిచి కలలు కన్నాను
అలా అలా అనాది అనాది అంధకార భయంకరాటవుల మధ్య
సృష్టి సింహం చేసిన ప్రథమగర్జన విన్నాను
పెనుతుపానులో సముద్రాల ఉప్పెనలో ఊగి ఊగి లుంగలు చుట్టుకు
పోతున్న
భూమి పేగుల్ని చూశాను
ఎగుడుదిగుళ్ళ దారిలో సుద్దకొండలు అగ్నిపర్వతాలు ఎడారులచుట్టూ

గిజగిజ లాడుతూ పెనుగుతూన్న ప్రాణహరితాన్ని చూస్తున్నా
పచ్చబడిన భూమిమీద ఫక్కున నవ్విన సూర్యుడి సంతోషపు వెలుతురు

విచ్చిన ప్రాణం చుట్టూ ఉబికిన వెచ్చని ఎర్రని నెత్తురు
నిలదొక్కుకున్న ఆదిమానవుడు నిలిచి పూరించిన శంఖం
ఇది సంగ్రామానికి సూచన
ఇది ప్రస్థానోపక్రమణిక
సీజర్ కౌక్షేయధార మెరిసింది
అలెగ్జాండర్ అశ్వారింఖా ఘట్టన మొరిసింది
రాజ్యం రమణినీ మించిన రమ్యభావన విరిసింది
షేక్స్పియర్ డాంటే కాళిదాసూ శంకరుడూ
మార్క్సు మహాత్ముడూ పికాసో సార్త్రే
ఎవరైనా ఇది నిరంతర నూతన పరిశోధన
సత్యసౌందర్యాన్వేషణ ఒక శిఖరారోహణ

*　　*　　*

కాలానికి ఒక రూపం లేదు దానికి పాపం లేదు
కాలం అద్దం లాంటిది
అంధయుగమైనా స్వర్ణయుగమైనా అది మన ప్రతిబింబం
కాలం వలయం లాంటిది దానికి కేంద్రంలేదు
ఎవడికివాడే యిచ్చా ప్రయత్నబలంలో
వర్ణోజ్వల వలయాలను సృష్టించగలుగుతాడు
కాలం జాలం లాంటిది
కళ్ళు మూసుకుని నడిస్తే ఉచ్చులో పడతాడు
శక్తిపరుడు యుక్తిపరుడు దాన్ని ఛేదిస్తాడు
కాలం సవాల్ వంటిది
సాహసవంతు డందుకొని ముందు సాగిపోతాడు
చప్పబడిన పెద్దన్నయ్య చతికిలబడిపోతాడు
ఆహార సమస్య అణ్వస్త్ర విపత్తయినా
ఆకలి రోగం రణం వ్రణం ఏదయినా
ఈ ధాత్రీ వదనాన్ని వికృతం చేసే ఈ మనుగడని భారం చేసే
దుస్సహ పరిస్థితి అనారోగ్య మనస్థితి అసంతృప్తి అవాప్తి
అవివేకులు స్వార్థపరులు కలిగించిన ఫలితం
తమని తాము బంధించుకున్న సూత్రాలలోంచి నమ్మకాలలోంచి

తప్పించుకోలేని మనుషుల నిస్సహాయ జనితం
కొత్తదారి తొక్కలేని కొత్తమలుపు తిరగలేని
కుంటి గుడ్డివాళ్ళ ప్రయాణ కోలాహలం
మురికి కాల్వమీద ముసలితనంమీద మృషాజగతిమీద
మహోదయం వికసించదు, వసంతం హసించదు
గదిలో కూర్చుని వసంతం వసంతం అని తన
మదిలో మలిన శృంగార తృప్తి పొందేవాడు వికారుడు శకారుడు
సంప్రదాయ భీరువుకీ అస్వతంత్ర వితంతువుకీ వసంతం లేదు
సాహసి కానివాడు జీవన సమరానికి స్వర్గానికి పనికిరాడు
హిమసుందర శృంగమైన ఎవరెస్టుని ఒక టెన్సింగే ఎక్కగలడు
సుమనస్సుందర వసంత గీతంలో ఉగాది నాహ్వానించగలడు.

*–1966*

★ ★ ★

# భరతవాక్యం

సుందర స్వప్నాల స్వర్గాల మేడమెట్లనుండి
వాస్తవికతా శిథిల బధిర రుధిర కూపానికి
హఠాత్ పతితుడనైన నాకు తెలుసు
అల్పమని నీవు అల్లిన గొలుసు.
మానవుడై నీవు చాచిన ప్రేమైక హస్తాన్ని
దానవుడై వాడు నరికిన చరిత్ర సమస్తాన్ని
పొంచి చూచిన నాకు తెలుసు
వంచిత మని మానవ మనస్సు
నీ నిరంతర తపస్సు ప్రసరించిన
విద్యుదావేశ తంత్రులు తగిలి రగిలి
నీ పాత తాటియాకుల ఇల్లు
తగులబడి బూడిద మిగిలి

నిలువ నీడలేని నిన్నూ నాకు తెలుసు
నీ మీదకే గురి పెట్టబడింది విధి ధనుస్సు.

కాదు ఇది నీ దేవీ పూజాపీఠ
మమర్చిన శుభ గృహాంగణము
పెద్దపులులు కొండచిలువ తెలుగులు
తిరుగు మహారణ్యము

ఒంటరిగాడవని నాకు తెలుసు
అందుకే వీళ్ళ కింత అలుసు
స్వార్థం ద్వేషం క్రౌర్యం వినా జీవితం లేదసలు
నాగరికత బండరాతి కొన తగిలి
చిల్లుపడింది నీ నొసలు
గాయం మానదని నాకు తెలుసు
గేయం ఇక ఎవ్వరూ వినరని నాకు తెలుసు.

ఇంతవరకు సత్య శాంతి సౌందర్య
సంగీత గీత మాలపించావని

ఇపుడింక వృథా చిహ్నితమైన
నీ కనుల కింద నలుపు చార చెరగదని

నీలాంటివాణ్ణి నాకు తెలుసు
నిద్రలోనే కలలకి సొగసు.

–1954

★ ★ ★

# త్రిశూలం

నమ్మకు నవ్వలేనివాడిని, పువ్వులు చిదిమేవాడిని
బరిమీద వదలిన పాముని, చైనావాడిని.
నమ్మకు హంతకుని ఈటెని, గోతులున్న బాటని
బోగందాని పాటని, చౌఎన్‌లై మాటని
నమ్మకు మొసళ్ళున్న సరస్సుని, మూర్ఖుడధ్యక్షించిన సదస్సుని
సినీతార వయస్సుని, మావ్‌సెటుంగ్ మనస్సుని....

సరిహద్దు మాత్రమే అయితే
సరిపెట్టుకోవచ్చు నోకలాగ
చిరకాలం కృషిచేసి మానవుడు
స్థిరంగా నిలుపుకున్న విలువల్ని
చెరపివేస్తానంటే ఊరుకునేదెలాగ?
దేశానికి హద్దులూ ప్రవర్తనకి ఎల్లలూ
ఆవేశాలకు మితీ, కావేశాలకి పరిమితీ
అవసరం మానవసౌఖ్యానికీ సఖ్యానికీ.

అందుకే అనాదిగా చరిత్రకి పునాదిగా
పొందుపరిచారు జాతికీ వ్యక్తికీ స్వతంత్రం
అందంగా అందర్నీ సమంగా వాడుకొమ్మన్నారు
అది కాదని వాదుకు సిద్ధమయితే
యుద్ధానికి కాలుదువ్వితే
ఊరుకునే చవట ఈకాలంలో ఎవడు?
ఉరుకుతాడు ముందుకు సింహంలా నరుడు
చివ్వకు ప్రతి భారతీయుడూ ఒక కవ్వడి
గవ్వకు మారడు శత్రువు వాడెవడైనా.

ఇకనుంచైనా చైనా బుద్ధిగా మెలగకపోతే
క్రకచం వంటి ప్రజాబలం కంఠాన్ని కోస్తుంది

సకల ప్రపంచం సంఘటితమై ఎదురిస్తుంది
మునుపటివాళ్ళంకాదు ముసలివాళ్ళం కాదు
మొనదేరిన బాకులమై మొహరించి నిలుస్తాం

ప్రతి సోల్జర్ ఒక శతఘ్ని
ప్రతి పౌరు డొక దవాగ్ని
ప్రతినబూని నిలబడు నిటారుగా
బ్రతుకెందుకు స్వతంత్రం పోవగా
ఇదే అదను పదును పెట్టు
పదే పదే యెద మొహదా
మనదేశం మన స్వప్నం
మరచిపోకు వెరచిరాకు
మనిషికి ఒకేసారి మరణం

—ఆంధ్రప్రభ వారపత్రిక, *1962*

★ ★ ★

# నా కవిత్వంలో నేను దొరుకుతాను

నీ కవిత్వం పుస్తకానికి ఎవరిచేతా పీఠికా పరిచయమూ
వగైరాలు రాయించవద్దు అన్నాడు-
నాలుగేళ్ళ క్రితమే నా చిరమిత్రుడు శ్రీపాద కృష్ణమూర్తి
సరీగా అలానే అన్నాడు నా యువమిత్రుడూ కవీ
వేల్చేరు నారాయణరావు కూడా
నాకన్న పెద్దవాడూ నన్నభిమానించేవాడూ
శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారు కూడా
అలాగే అన్నారు
పైగా నామీద నన్నే రాసుకోమన్నారు - నాకు
రాయాలనిపిస్తే.
ప్రతీ కవిత్వమూ కవి తనమీద తాను రాసు
కొన్నదే ఓ విధంగా ఎందుకంటే కవిత్వం
అల్టిమేట్‌గా సబ్జెక్టివ్ గదా
నా కవిత్వంలో నేను దొరుకుతాను

* * *

ప్రబంధాలూ తద్గత వర్ణనలూ చదువుకుంటూ
అలాంటివే రాస్తూ కూడా ఏదో తృప్తీ ఆనందమూ
పొందలేక ఇంకా ఏదో నాకు తెలీనిదేదో
ఉందనుకునే బాల్యంలో
ఒక మునిమాపు వేళ మా వూళ్ళో ఒక కదంబ
వృక్షచ్ఛాయలో మొదటిసారిగా దేవుల
పల్లి కృష్ణశాస్త్రిగారు తమ ఊర్వశీ ప్రవాసం
లోంచి
వివరాలీ విభావరీ వేళాశాలల
నీ మసలు చరణ మంజీరము గుసగుసలో
అన్న గేయం విన్నప్పుడు

చటుక్కున ప్రబంధాల బలవంతపు వర్ణనలూ
బిగుసుకుపోయిన భాషా శరీరాలూ, మా
వూరి రోడ్ల దుమ్మూ అన్నీ మాయమై పోయి
నేను నా లోంచి కదలిపోయి జాలిజాలిగా
గాలిలో చిరుచీకటిలో నక్షత్రాల చిరుకాంతిలో
కలసిపోయి ఏదో ఏదో అయిపోయిన క్రొత్త
చైతన్యంలో ఆ రాత్రంతా నేను నిద్ర పోలేదు
ఆ తర్వాత కొన్నాళ్ళకు ఒక పల్లెటూరి పొలి
మేరలో నన్ను నిలబెట్టి ఒక విప్లవ యువకుడు
శ్రీ శ్రీ కవితా ఓ కవితా తన గంభీర కంఠంతో
వినిపించినపుడు లక్ష జలపాతాల పాటలూ
కోటి నక్షత్రాల మాటలతో పాటు రాజ్యాలూ
సైన్యాలూ విప్లవాలూ ప్రజలూ శతాబ్దాలూ
నా కళ్ళముందు గిర్రున తిరిగి నేను చై
తన్యపు మరో అంచుమీద నిలిచాను.

* * *

కవిత్వం మారిపోతుంది. కవితా స్వభావం మారిపోతోంది.

* * *

......అయితే యింక టెక్నిక్ మీద వచన
కవితారూపం మీద ఇలాంటి వాటిమీద
రాసుకోవాలి.
నేనూ అలాంటి వాటిమీద ఏదో చెప్పగలను
రాయగలను. కాని అవి అంటే నాకు
గొప్ప చిరాకు
నా కన్న ఓర్పు ఉన్న వాళ్ళు, బుద్ధిమంతులు
వాటిని గూర్చి విపులంగా సూక్ష్మతర
పరిశీలనతో రాస్తూనే ఉన్నారు.

సృష్టియొక్క రహస్యం స్రష్టకి తెలియక
పోవడమే విచిత్రం అద్భుతం, అద్భుతం విచిత్రం
"ఇలాంటి పిల్లవాణ్ణి ఎందుకు కన్నావు--

ఏయే మార్పులు శక్తులు, నీలో పనిచేశాయి"
అంటే ఏ తల్లీ చెప్పలేదు

ఏ ద్రవ్య సంయోగం వల్ల ప్రాణం కలుగుతుంది
ప్రాణానికి ఏ రూపం కావాలో ఏ రూపం సరి
పోతుందో ప్రాణమే నిర్ణయించుకుంటుంది.
శరీరం ముందుగా ఏర్పడి దాన్లో ప్రాణం
దూరి కూర్చోదు.
"కొన్ని వందల ఏళ్ళనుంచి పద్యం వుందికదా
ఛందస్సులున్నాయి కదా వీటిని వొదిలేస్తున్నావేం"

- (అసంపూర్ణం)

★ ★ ★

# నిన్న రాత్రి వర్షంలో

నిన్న రాత్రి వర్షంలో తడిసి నీ గుమ్మం తట్టినప్పుడు
నిదుర కళ్ళతో చూసి జాలిగా నవ్వి రమ్మన్నావు

నా కళ్ళల్లో తడిసిన చీకట్ల మధ్య చంద్రవంక విరిగి
నా గుండెల నంటుకొన్న షరాయి మీద పుప్పొడి చెరిగి
నేను సిగ్గుపడి తలొంచుకొని నీకేసి చూడకుండా
గబగబా నా గదిలోకి వెళ్ళి తలుపేసుకున్నాను

ఎక్కడెక్కడ ఒక్కణ్ణే తిరిగానో రాత్రి ఏకాంతంలో
ఎన్ని దీన నయనాల్నీ ఎన్ని మౌన నిశ్వాసాల్నీ
ఏరుకున్నానో చటుక్కున నా సంగీతం ఆగిపోయి
అపూర్వమైన నా సంగీతాన్ని తెచ్చి నీకు కానుకగా యిస్తానని

అనంతమైన నా ప్రేమ నిరూపిస్తానని ప్రతిజ్ఞ చేసి
ఆ రాత్రి వెళ్ళిపోయాను నేను
అలా నగరాలకి నగరాలు దాటి అడవుల్ని దాటి
ఆకాశ నక్షత్రాలను మీటి అనంత దిగంతాలు వెతికి

ఎక్కడెక్కడ ఒక్కణ్ణే తిరిగానో రాత్రి ఏకాంతంలో
ఎక్కడ చూసినా దీన నయనాల ప్రశ్నలు
మౌన నిశ్వాసాల పిలుపులు బావురుమనే గుండెల ఏడ్పులు
బాధల సలసల కాగే బ్రతుకులు.

★ ★ ★

# ముసలిదైపోయింది భూమి

ముసలిదైపోయింది భూమి
మూర్ఖులైన తన కొడుకుల్ని నమ్ముకుని
ముసురుకున్న బాధల వానకారులో
మసలుకొనే దెలా చివరికంటా
మసి బారింది చూపు
పసి చెడింది రూపు
సముద్రం సన్నిధిని కన్నీరు పెట్టుకుని యేడ్చింది
సాగర భ్రాత కెరటాల గుండె
హోరుహోరున మ్రోగింది
ముసలిదైపోయింది భూమి
మోయలేని తన వయస్సు
మొత్తం కొన్ని వేల యేళ్ళ బరువు
ముడుచుకొని పోయిన తన వొడలి ముడత
లెన్ని స్మృతులకెన్ని కథలకి తెరువు
ఏనాటి దామాట
ఎప్పటిదా ఆటపాట
పచ్చని తన పడుచుదనం మీద
వెచ్చగా పడిన
ప్రథమ సూర్యోదయాశ్లేషానికి
పులకరించి
చెంగలించి పరవశించి
అగ్నిపర్వతాల లాటి కాంక్షలు రేగి
అంబోధి వెడల్పు ఆశలెదలోన మ్రోగి
కొండల కోనల సెలయేళ్ళ సరదాలతో
కూరుములు నింపుకున్న నవజీవన హేలతో

★ ★ ★

# నా భరత ధాత్రి

మూడు సముద్రాల కెరటు కెరటాల నీలాల
మోహన వస్త్రం దొలిచి
మౌళి మీద హిమసుందర కిరీటం ధరించిన
రాజ్ఞి నా భరతధాత్రి అనుకోవడం ఒక నిజం!
అదొకసుఖం.

మూడు సముద్రాలు మూసిన కోసిన తీరంతో
ముగ్గు బుట్టలాంటి తలమీద కొండంత బరువుతో
మూల్గుతున్న ముసలిది నా తల్లి అనుకోవడం
మరో నిజం అదో దుఃఖం

ఇదీ నిజం అదీ నిజం
రెండింటికీ రుజువులు సమం

శ్రీరాముడి శ్రీకృష్ణుడి జన్మభూమి మరి
కంసునికి దశకంఠునికీ కాదా?

# సమాజం

ఒక్క ఆకైనా పండబారి రాలిపోతూన్న వైనం
చెట్టుచెట్టంతకీ తెలుసు కాని చెప్పదు చెప్పలేదు పైకి
ఒకడు తప్పిదం చేస్తే చాలు దాని వెనుక నిలిచి ఉంది
సమాజం సమాజం అంతటా గుప్తంగా ఉన్న
కుటిల బుద్ధి స్వభావం.

# నిజాలు

ఉదయపు నీరెండలో నిలిచి శిరోజ సౌఖ్యాన్ని
దువ్వెనతో మంచుబాలను చూసి,
ఉషఃకుమారివి నీవని ప్రశంసించు—
అది అందమైన నిజం

దారిలో ఎదురైన అంధుడిని గాంచి,
తడబడుతూ నడుస్తూన్న అంధుడినిచూసి
చీకటి నీ తల్లి అని చెప్పకు సుమా—
అది కటువైన నిజం.

# వసంతం

మనమ్మాయి అద్దం ముందు డ్రీమ్‌గా నిలబడుతుందెందుకు?
ఇదిగో చూడు!
చెంపలు నెరిసినా అదేవిటి నీ మొహంలో ఏదో అందం!
సిగ్గుపడకిలా చూడు!

చిన్నప్పటి సరదాలూరికే జ్ఞాపకం వొస్తున్నా యెందుకు?
చూరులో పిచ్చిక ఎంత ముద్దుగా చిలిపిగా గంతులేస్తోందో
చూడిటు గోరింట పువ్వింత అందంగా వుంటుందని నాకు తెలవదు!
గది ఏమిటో బోడిగా ఉంది చక్కని డిజైన్ గల టేబిల్‌క్లాత్ కొంటా నుండు.

ఈ రాత్రి పడగ్గదిలో అగరొత్తులు వెలిగించి ఉంచు సుమీ! హాయిగా
ఉంటుంది!
గుసగుసలాడుతూ వస్తున్న గాలి పైట తొలగిపోయినట్టుందేవిటి మల్లె
చెట్టు!
ఆడదానిలా వుందేవిటి ప్రకృతి.

# గ్రీష్మం

పంకా కింద బద్ధకంగా పడుకున్నాను
బద్ధకంగా బెంగగా పడుకున్నాను
గది అవతల స్టెయిన్‌లెస్ స్టీలు రేకులా ఎండ
చెట్టు మొదల దాహంతో నోరు తెరిచిన తొండ
విరహంలా వేడి గాడ్పువీస్తోంది
విచిత్రంగా మనస్సు భ్రమిస్తోంది
ఇవి గ్రీష్మ ప్రథమ దివసాలైనా
ఇంకా వసంతపు గడుసుతనం వేధిస్తోంది
తలుపులు మూసుకున్న గదిలో నాలో...

★ ★ ★

# వేకువ

రాత్రిని రంపం పెట్టి కోసినపుడు
రాలిన పొట్టులాగుంది వేకువ
రాత్రంతా నిశ్శబ్దపు వలలో తగుల్కొన్న పక్షులు
తటాలున విడిపించుకు ఎగిరిపోయినట్టు కువకువ
రాత్రికీ పగలుకీ మధ్య అంచుదగ్గర
రక్తం చిమ్ముతున్న కాలంలో వంకర
మోకాళ్ళపైకి మడతపడిన లంగా
నిద్రలోనే సవరించుకుంటూ
కలలో కుర్రాడి కౌగిలికి సంశయిస్తూ
సమ్మతిస్తూన్న సుందరి
రవిక దాచని రొమ్ములతో వెలకిలా పరున్న గృహిణిని
రహస్యంగా అసహ్యంగా చూస్తూన్న పాలేరు సింగడు
ఆకాశానికి చేతులెత్తి ఆక్రోశిస్తూన్న ఫ్యాక్టరీ గొట్టం
హైరోడ్డుమీద నలిగీ నలగని కంకరమీద లారీ
వెళ్ళిన గరగర శబ్దం
దేవాలయం అరుగుమీద మేల్కొన్న ముష్టివాడూ
అతని కురుపు సలుపూ
రాత్రి క్లబ్బులో తప్పతాగి తందనాలాడి
వచ్చిన భర్త క్షేమానికి
తులసికోట చుట్టూ కన్నీటి దీపాలు
వెలిగిస్తూన్న యిల్లాలు
మిల్ ఓనరు కలలో మంటల రథంమీద
వస్తూన్న ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరు
వాడి కొడుక్కి రిట్జ్‌లో రీటాతో
రాక్ అండ్ రోల్ చేస్తుండగా
కాలు విరిగినట్టు కల
నిద్రా జడత్వంలోంచి చీలిన మృత్యువులోకి
మేల్కొంటున్న నగరం
కట్టు తప్పిన నగరంలో పట్టుతప్పిన సంఘంలో...

★ ★ ★

# యాడిపస్

రాజాంతఃపుర పురో భాగంలో మెట్లమీదా
వేదికలమీదా థేబ్స్ నగరం జనులు గుంపులుగా
కూడి ఉంటారు.
మధ్యగా ఉన్న గుమ్మం నుండి యాడిపస్ వస్తాడు.

యాడిపస్:— ప్రజలారా నా ప్రజలారా కాడ్మస్ వంశీకులారా

ఏమిటి మీ నివేదన మీ దీనవదన ప్రార్థనమ్ము
ఈ నగరమ్మంతా తోరణమాలలు ధూపమ్ములు దీపమ్ములు
ఏ బాధా నివారణకు ఏ వాంఛా పరిపూర్తికొరకు?
మీ మనోగత భావాలను తెలిసికొనగ నేనై వచ్చితి,
మీ రాజుని యాడిపస్ ప్రభువుని – సుప్రథిత కీర్తిని
(అక్కడున్న ధర్మకర్తతో)
ఓ పూజనీయుడా గుణవయోవృద్ధుడవైన నీవే
వీరికి ప్రతినిధివై పలకగ లెస్సగ తగుదువు
ఏమిటి మీ కోరిక ఏటికి మీ కన్నులలో భయాందోళన
చెప్పండి హృదయంవిప్పి చేస్తాను శక్తివంచన లేకుండా
ఈ బహు ప్రజావాణిని నిర్లక్షించే నిర్దయుణ్ణి కాను నేను
వీరందరికీ ప్రతినిధివై విన్నవింప తగుదువు
ఏమిటి మీ నివేదన మీ కన్నులలో ఈ భయాందోళన
నిర్దయుణ్ణి కాదు నీరసుణ్ణి కాదు మీ ప్రజావాణిని
నిర్లక్షించే తెంపరిని కాను – చెప్పండి మీ మనోవ్యధ

పురోహితుడు:

అవధారు మమ్మేలిన ప్రభూ అవధారు రాజా
పాలబుగ్గల పసినిసువులు జాలిగొలిపే వృద్ధులు
పరిపూర్ణ యౌవన సుందర సుమాలు యువకులు
ఇక్కడ బజారులో నగరమంతటా

పవిత్ర పల్లాస్ వేదికల వద్ద
ఇస్మీనస్ నదీతీరాన జ్వలించే దివ్యాగ్ని హోత్రాలవద్ద
సమావేశమైన హేతువును చిత్తగించండి ప్రభూ!
గుంపులుగా కూడిన మా గోడును ఈ కీడును
గమనించండి ప్రభూ
మృత్యువూ కాటకమూ మోహరించి నగరంపై నిలిచాయి
దారులన్నీ మూసి దారుణ వినాశోత్సవం చేసుకుంటున్నాయి
ఫలవంతమైన భూమి కడుపును కొట్టి
పచ్చని పచ్చికల చిచ్చు పెట్టి
తల్లి కడుపులో ఉన్నపుడే లేత లేత కందుల
ప్రాణాలకు చెల్లుకొట్టి
కోటికోరల కాటకం చెలరేగి
కోటిగొంతుల ఆర్తి మిన్నంటి పోవగా

ధర్మకర్త:– ప్రభూ

ఏలికవు మాకు దొరవు మాకు
ఎవరికింక చెప్పకోము
పాలబుగ్గల పసివాళ్ళనుండి
ముక్కుతూన్న ముసలివాళ్ళ వరకు
దేవుని పూజారులమైన మేము
యౌవన వనంలో విరిసిన పువ్వులు వీరు
అందరమూ పల్లాస్ పూజా వేదికలవద్ద
ఇస్మీనస్ పవిత్రాగ్నిహోత్రాలవద్ద
ఇక్కడ అక్కడ ఊరంతా
ఇలాగే తరు శాఖలు దాల్చి
యీ వేదనా నివేదన
చేస్తున్నా మవధరించండి
మీకు తెలుసు ప్రభూ
యీ నగరం మృత్యుపాశంలో చిక్కుకుందని
మృత్యువు కెరటంలా
ఈ నగరంపై విరుచుకుపడుతోందని.

థేబ్స్ రాజదంపతులు లాయిస్, జొకాస్టాల కొడుకు యీడిపస్. అతను పుట్టగానే, తండ్రిని చంపి తల్లికి భర్తవుతాడని జోస్యంలో తెలుస్తుంది.

శిశువుని నిర్జనమైన కొండల మీద వదిలిపెడతారు, చచ్చి పోతాడని. గొర్రెల కాపరి రక్షిస్తాడు. తన నిజమైన తల్లిదండ్రులెవరో తెలీని యీడిపస్ లాయిస్‌ని చంపడం, థేబ్స్ రాజై జొకాస్టా భర్తవడం జరిగిపోతాయి. కొన్నేళ్ళకి థేబ్స్ నగరం అంటువ్యాధులతో మృత్యు ముఖంలో అల్లాడిపోతుంటుంది. భయ విహ్వలత్వంతో ప్రజలంతా ప్రార్థనలు చేస్తుంటారు.

ప్రఖ్యాత గ్రీకు విషాదాంత నాటక రచయిత సోఫోక్లీస్ (క్రీ.పూ. 496-406) రచన 'యీడిపస్ రెక్స్' నాటిక ప్రారంభ భాగానికి అనువాదం.

* * *

# నగరంపై పీడనీడ

పల్లాస్ పూజా వేదికలవద్ద
ఇస్మీనస్ నదీతీరాన జ్వలించే
పవిత్రాగ్ని హోత్రాలవద్ద
బజారులమ్మట రాజప్రాసాదాలవద్ద
చేరిన యీ జన సందోహాన్ని చూడు ప్రభూ
చిదిమితే పాల్గారే చిన్నారిబుగ్గలు
ముక్కుతూ మూల్గుతూ ఉండే ముసళ్ళు
మోహన యౌవన వనసుమాలు తరుణవయస్కులు
వీరందరినీ కనికరించు అవధరించు ప్రభూ
ఈ నగరంపై ఏదో నల్లని పీడనీడ పడింది
మృత్యువు తన భయంకర పాశాన్ని విసిరింది
సౌభాగ్యవతి ధాత్రి యిది
మన వంశపిత కాడ్మస్ గృహలక్ష్మి....

*–1966*

★ ★ ★

[ఇది 'యీడిపస్' కవితలోని కొన్ని కొన్ని పాదాలకు తిలక్ రాసుకున్న పాఠాంతరం కావచ్చు. అసంపూర్ణం 1966. ప్రకాశకులు]

# ప్రాణంలేని నీడలు

నాలుగు మూలల రాతిగోడలు నిలిపి
తలుపులు బిగించి చీకటిని రగిల్చి,
గాలిలేని, వెలుతురులేని, నీడలేని,
యీగదిలో
కదలలేక మెదలలేక
ఊపిరి తీయలేక
చెదపట్టిన యెముకలు వంగలేక, విరగలేక,
నీలో ప్రాణశక్తి, దివ్యదీప్తి
నరనరాల చైతన్యం
రక్త కణాల ఆరుణ్యం
నీలోనే నివురుగప్పి, పొగచూరి, మగ్గి మగ్గి,
వెదజల్లును అసహ్యాపుటావిరులను,
విరులు వడలిరాలు నిస్తబ్దపుకావిరులను.

ప్రతిదినమ్ము, ప్రతి ప్రత్యూషఃపవనమ్ము,
ప్రతినిశీథ తారకల సంభ్రమణ గానమ్ము
ప్రతిమబ్బు కొస దిగజారి పరుగులిడు మెరపు
ప్రతి పూతావి తరగ
గుహలోని పులికేక
గుడిలోని జయఘంట
నీ గదిచుట్టూ తిరిగి తిరిగి
నీ గదిగోడల తాకి తాకి
నీకోసం పిలిచి పిలిచి
కరగిపోవును కాలపు శూన్యతలో!

కాని నువ్వు కదలవు, మెదలవు,
నువ్వు కన్నులు తెరవవు, చూడవు,
నువ్వు చీకటివి,

కనుపాప కరిగిన తెల్లగుడ్డివి,
నువ్వు రోగివి, జోగివి, కదలే శవానివి!

వెడలిపోయిన యుగయుగాలలో
చచ్చిన పూర్వులు చేసిన శాసనాలు
నీకు తల్లికడుపులో ఉన్నపుడే సంకెళ్లయి,
నువ్వు ఊపిరి పీల్చిననాడే ఉరిత్రాడయి,
పగపట్టిన పామై
కాలపు చీకటి లోయలన్నీదాటి,
వంశవంశముల రక్తజలధులు దాటి
నిన్ను తరుముకొని తరుముకొని వస్తే
లొంగిపోయిన లోహితాస్యుడవు!

ముసలి మర్రిచెట్టు వూడలవలె,
శిథిలమైన కోటల గోడలవలె
వదలక, కదలక,
గుండెలకు చుట్టుకొని, నెత్తుటిలో పొదిగికొని,
పెరిగిపోయే కట్టుబాట్ల పాతవస్త్రముల మూట
మోసికొని మోసికొని, క్రుంగి క్రుంగి
సంఘ గార్దభం ఓండ్ర పెట్టగ
నీవూ నేనూ ప్రతిధ్వనించాం!
నీవూ నేనూ ప్రతిబింబించాం!

అప్పుడు నీలో నాలో నడుము విరిగి
నిలిచింది ప్రాణశక్తి!
నీ భవిష్యత్తు కోనేరుగా,
నీ ఆశలు తెల్లని బాతులుగా
ఊహించిన హృదంతర దృగంతర దివ్యత్వం
నీ పిరికితనపు వాగురలో చిక్కి,
నీ జడత్వపు ధూళిలో నవసి,
నశిస్తుంది – నువ్వు
జనన మరణాల మధ్య గంతువేసే
కీలుబొమ్మవై వసింపగ!

ఇంత హింస, నోరులేని బాధ,
చూపుకొసలనటించు పైశాచిక ద్వేషము,
నిన్ను కదలనివ్వని బెదరు, లోలోన వెగటు
ధూళిక్రమ్మిన మనస్సు,
ఆకసపు నీలి అంచుల పిలుపు వినలేని బధిరత
దశదిశల యేడ్చు అవ్యక్తగళసహస్రములు
ముసురుకొన్న యీగల తోలలేని వ్రణము;
ఏ తల్లి ఉసురు, ఏ క్షుధా శాపము,
ఏ నొసట చితికిన వెలుగుల కలవరింత,
ఈ అశాంతి, ఈ శిఖపరచలేని మంట
ఏ భూమికడుపు పగిలి పొగిలిన పొగలపంట
ఏమహోత్పాత సూచనా సృగాలరవములో,
ఏ శాంతిదేవతా వసనమంటుకొన్న ఆర్తిధ్వానమొ
ఏదీ నీ జవాబు,
ఏదీ నీ జవాబు!

అవధిలేని దీకాలము
రహస్యమీమహావిశ్వము,
స్వేచ్ఛతో నీపైన అవకాశములో పరిభ్రమించే
అనంత అనంత తారకాగోళముల సందేశం,
ప్రతిరాత్రి చీకటులను చంపి
నవ్యమై, దుర్నిరీక్ష్యమై వెలిగే
సూర్యగోళపు తిరుగుబాటు

కోన కోనకీ పూవై, పూవు పూవుకీ తావై,
జలధి జలధికీ తరంగమై
అవని అవనికీ పొరయై,
అవధిలేని అవధులకు అవధియై
రేణువులో యిమిడిన ఆ ప్రాణశక్తి
వేణువై పలికిన
సర్వతోముఖ వికాస విద్యుద్గానం
పొర పగిలిన నీ శ్రవోరంధ్రములకు వృథా, వృథా!
సుడి తిరిగే నీ అంధత్వానికి వృథా, వృథా!

యుగయుగాల చరిత్రకు,
తరతరాల పరిశ్రమకు
నోరులేని బాధలుగా
నిశ్శబ్దపు సాక్షులుగా
నిలిచిన ఆ వయోవృద్ధ శుభవత్ హిమవత్
పర్వత పంక్తుల్ని అడుగు!
ఆ పర్వతపు మొదటిరాయి
అనాది అనాదులకు చొచ్చుకొని
జీవితపు పునాది స్వతంత్రమని
ప్రవహించు మహాప్రవాహమని,
ధగద్ధగద్ధావళ్య ధర్మైకరోచిస్సు అని,
చెప్తుంది తన శాంతగభీర
నీరవగళత్తుషార కణజాలనోద్రిక్తగళమ్ముతో!

కాని నేడు,
కరుణలేక, కన్నీరులేక
బలములేక, బ్రతకలేక,
నీలోన నాలోన
నైరాశ్య నైదాఘ అఘకీల లెగసిపడ
ఎండమండు దేహములతో,
పిడచగట్టు నాలుకలతో,
ఎడారి అంచుల నానుకుని
మన బ్రతుకు లంటుకుని,
గాలి ధూళి నెగురు కాగితపు పేలికలమై,
చావలేక, బ్రతకలేక,
అనంతమును కౌగిలించిన ప్రేమ
బాహువులు నరుకబడ,
అంతరాంతర శుకవచస్సు వినలేక
నిస్సహాయత ఎదురు తిరగలేక,
తిరుగుబాటు చేయలేక
మంటలు పొదగలేక,
చిచ్చును నవ్వలేక, కొరకంచులు విసరలేక,
గాలిలేని, నీడలేని, వెలుతురులేని యీ గదిలో
కదలలేక, మెదలలేక,

చెదపట్టిన యెముకలు వంగలేక విరగలేక,
బ్రతుకుతున్నాం, చప్పుళ్లనుచేస్తూ
ఎండుటాకుల గలగలలటు,
కుష్ఠరోగుల మూలుగులటు.

★ ★ ★

[ఈ గేయం 'విజ్ఞాన సమితి' తణుకువారు ప్రచురించిన 'నవ్యాలోకము' అనే ఆధునిక కవుల కవితా సంకలనంలో ప్రచురితమైంది.]

# మళ్ళీ ఒక దీపావళి

దేశ దేశాల మైత్రీ దీపాన్ని వెలిగించి
నాదేశ సౌభాగ్యాన్ని ఆకాంక్షించి
చరిత్ర ఎండిన గొంతులో పవిత్ర శాంతిసుధని చిందాలని
ఒకరి జోలికి పోక ఒదిగి మనం ఉంటూంటే
అంతవరకూ మనవాడు మనవాడనుకుంటూన్నవాడు
ఆరేళ్ల క్రితం సరిహద్దులు దాటిన, హద్దులు మీరదనుకున్నవాడు
అన్నయ్యలాంటివాడు అమాంతం కన్నంవేసి చూరుకి నిప్పంటించి
సొంతం నాదేనని మీదికొచ్చేటప్పటికి
చటుక్కున వాస్తవిక జగత్తులోకి జారిపడ్డాం....

మన మంచితనం మన్ని వంచించింది
మనవాడు మానవుడుకాడు దానవుడని తెలిసొచ్చింది
ఆసేతు శీతనగమధ్య ధరిత్రి కంపించింది
అశేష ప్రజాపారావార మువ్వెత్తుగా లేచింది
అకుంఠిత శౌర్య సాహసాధ్యాయం మొదలయింది....

ఇదీ ఒకమంచికే వచ్చింది
స్వతంత్రాన్ని చవిచూసినవాడు
స్వర్గంలో నివసించినవాడు
బానిసత్వానికి తలఒగ్గలేడు
నరకానికి ససేమిరాపోడు

యుద్ధం జాతిని సన్నద్ధం చేస్తుంది
యుద్ధం వైవిధ్యంలోంచి ఏకత్వాన్ని ప్రాదుర్భవింపచేస్తుంది,
యుద్ధం మన్ని సముద్రగజామదగ్న్యుల్ని చేస్తుంది
సజ్యకార్ముకాశ్లిష్ట భుజాబలోద్బుద్ధ పార్థుల్ని చేస్తుంది
చండికా చాముండికా సమ్రప్రతాపోద్దీపితోద్దండమండితాఖండ
నారీమండలం మనకి అండగా నిలుస్తుంది

శత్రు సమూహ సంహార సమర్థుల్ని చేస్తుంది
రుద్రుల్ని ద్వాదశాదిత్యుల్ని చేస్తుంది
సర్వభారతం ఒక్కటినాడు, సర్వపక్షముల కొక్కచక్షువినాడు
శతకోటి హస్తములు ఒక్కటిగ నొక్కిన చప్పటులు నేడు
సమర ఖర్జూసింహగర్జాభీలనాదమే దెస దెసల మ్రోగు
ఇంక భయంలేదు జాతి తన సత్వాన్ని గుర్తించుకుంది
తన అస్తిత్వ సత్యాన్ని గ్రహించుకుంది,
వందలాది వత్సరాల మగతలోంచి మాయలోంచి
జడిమలోంచి జబ్బులోంచి కోలుకుంది, బలం పుంజుకుంది!
ప్రాచీనమైన ఆత్మ పునరున్మిషితమైంది!
సాచీకృత శివధనుస్సు నవ్యాకృతి నిల్చి శబ్దించింది
ధైర్యంగా నిలబడింది దృఢంగా కలబడింది
ముందుకు ముందుకు నడచింది
మొనగాళ్ల మనిపించుకుంది –

హుటాహుటిగ నడుస్తుంది హిమాలయం దాటుతుంది
విపక్షుల్ని పక్షుల్లా తరుముతుంది విద్రోహుల నిప్పులతో చెరుగుతుంది–
మన ప్రధాని శ్రీకృష్ణుడు, ప్రజాశక్తి సత్యభామ
దొంగచాటు బందిపోటు చైనాసురుడొరుగుతాడు
మన పతాక హిమగిరిపై మళ్ళీ ఆడుతుంది –
మళ్లీ ఒక దీపావళి మళ్ళీ ఒక దీపావళి
కొత్త కొత్త దీపావళి శాంతిసౌఖ్య తారావళి
గళగళానగళన్మధు మందారకుసుమహారావళి
భారత జనయిత్రీ పదపూజా నవగీతావళి
మళ్ళీ ఒక దీపావళి
మనకే కాదు – మహీవలయ సమస్తానికి
మహదాశయ జీవన విధాన మహస్సీమకి....

★ ★ ★

[ఆకాశవాణి విజయవాడ కేంద్రం నుంచి ప్రసారితం – 'వాణి'లో ముద్రితం అయినట్లు గుర్తు.]

# వర్షహేళ

తన విశాల వినీల ఘనాఘన చేలాంచలముల
దశదిశలకు విసరుచు
హిమవింధ్యా శిఖరపతత్ పవనచలత్ తరు
పర్ణకోటి నెగజిమ్ముచు
నిజసముద్ర హృద్బడబాయిత విరహాగ్ని చ్ఛటా
కుఠారముల ద్రిప్పుచు
వచ్చెనోహో వర్షానవతరుణుడు ధాత్రీ హృదయేశుడు
కడు వడిగా

మ్రోసెను పెనుదంభోళిక సకల వనాంతర నర్తిత
మయూరి మాలిక
కిసలయిత కదంబకురవక పున్నాగలవంగవల్లీ
నవకింశుక
ఆకుపచ్చనొయ్యారము నొలికించెను ధాత్రినేడు
వాసక సజ్జిక
చందనవన సురభిళ పటువక్షోజ గిరీంద్రహారి
నిరస్తకంచుక

కోటి కోటి జలధారా కరములాని కౌగిలింప
ధాత్రీమదవతి
కరగి కరగి రససేచన పులకరించి పారవశ్య
తనులతికాభృతి
పరిమళించెనమృత్ మృదులానిల తరంగలీలా
విస్తృతవిహృతి
గాఢము తత్ప్రేమమోహధరారమణి చూడు నేడు
సద్యోగర్భవతి

సకలధునీ వివిధవనీ సంభ్రమచణ వర్షానిల
మహోగ్ర భూమిక
చికురాంచల వారిబిందునివహాంతర వీక్షాతుర
ప్రోషితభర్తృక
కకుబంతవియచ్చరగృహగాఢాంధహర సమర్థ
శతవిద్యుద్దీపిక
భయకుంచిత శకుంతగణ దీనారవ సంకులకులాయ
తరువాటిక

వరిమొలకలు లేచెను చిరులతికలు పూసెను తరు
కాండము లూరెను
ఆనందమహోత్సవారభటి రమణుని ప్రావృషేణ్య
పర్జన్యము మ్రోగెను
శ్యామలమై బర్హిబర్హశోభనమై వేణువనము
వాతోచ్చలమై
భూదివ సంయోగమోహో! రాధాకృష్ణులవలె
సుందరమై స్వాప్నికమై

★ ★ ★

['సాహితి' మాసపత్రికలో ముద్రితము.]

# నిరీక్షణ

ఈవేళ నువ్వు వస్తావని మెయిలులో దిగుతావని
తప్పక వస్తావని తప్పక తప్పక వస్తావని
ఈ ఉదయానికి అందం తెస్తావని, అర్థం యిస్తావని
ఈ ఎదురుగా ఉన్న ట్రాములకన్న
బస్సులకన్న ఈ వీధమ్మట పోయే జనంకన్న
ఈ దేశంకన్న, ఈ విశ్వంకన్న
అన్నిటికన్న, అందరికన్న ముఖ్యమైన వాడివిగా
నా కళ్లకి వేడిగా
నా గుండెల్లోకి వాడిగా, నేరుగా
నా ఒళ్లోకి తావిగా, నావాడివిగా
వస్తావని వస్తావని తప్పక వస్తావని
షాంపూ ఘుమఘుమల విదల్చే
కురుల్ని సిగగా చుట్టి, గులాబీలు తురిమి,
న్యూలుక్ బ్రా ధరించి, మొఖమల్ చోళీ ధరించి
జార్జెట్ చీరని ఒంటికి సున్నితంగా సవరించి
ఈ గుమ్మం ముందు నిల్చున్నాను నీ కోసం
నీ కోసం
నీ కోసం
అందానికి అవధిగా, యౌవనానికి శిల్పంలా
చైవక్స్ షావడా గీసిన బొమ్మలా......
ఎదురుగా
రకరకాల మనుష్యులెండలో మెరుస్తూ
పక్కింట్లో రేడియోగ్రామ్‌లో
పాటలు గాలిలో తేలుతూ, ఊగుతూ
కాస్త దూరాన పార్కులో పూసిన పువ్వులాడుతూ
ఆకుపచ్చని సిగ్గుల్లో, వలువల్లో దాగుతూ, పిలుస్తూ
వేపరమ్మ కుర్రాడి గొంతులో ఏదో వింత సంతరిస్తూ

ఎంతో అందమైన యీ ఉదయపు
నీరెండవాన చినుకుల్లో తడుస్తూ,
ఒక్కొక్క ఉద్రేకపు తరంగాన్ని
గుండెల్లో జాగ్రత్తగా కొత్తచీర వంపుల్లా మడుస్తూ
నిల్చున్నాను నీ కోసం
నీ కోసం, నీ కోసం. . . . . . . .

*[అసంపూర్ణము]*

[ఈ అసంపూర్ణ గేయం 24–2–1992 'ఆంధ్రజ్యోతి' దినపత్రికలో ముద్రితమైంది – ఇదీ, కృష్ణశాస్త్రి గారిపై శ్రీ తిలక్ వ్రాసిన అసంపూర్ణ వ్యాసం.]